# సర్ఫ్ కొనడంలో మరింత వివేకం ఉంది

"తెలిసే చెప్తున్నా. సర్ఫ్ కొనడంలో ఉన్నంత వివేకం మరి దేనిలోనూ లేదు. దీని పవర్ ప్యాక్డ్ ఫార్ములా సామాన్యం కాదు— ఉప్పొంగే శక్తి! మీ డబ్బుకి మించిన విలువ ఇస్తుంది!"

**డబ్బుకి మించిన విలువా? అసలే సర్ఫ్ ఖరీదైనది కూడా కదా?**

"చూడండి! దీని వల్ల ఎంత ఎక్కువ ప్రయోజనమో గ్రహించారా మీరు? కేవలం సర్ఫ్ మాత్రమే నా బట్టల్ని అతి తెల్లగా ఉతుకుతుంది. పైగా వాటిని సంరక్షిస్తుంది. అందేత అవి కొత్త వాటిలానే కన్పిస్తాంటాయి. అంటే ఎప్పటికప్పుడు ఆదా— లెక్క కట్టి చూసుకోండి. సర్ఫ్, డబ్బుకి మించిన విలువ ఇస్తుందని అందుకే అన్నాను నేను".

**సరే లలితగారూ, కాని అందుకు సర్ఫ్‌లో ఉన్నది ఏమిటి?**

"ఎంతో ఉంది! ఒక కిలో మామూలు రకం పొడరు ఎంత ఉంటుందో, అంత పొడరు ½ కిలో సర్ఫ్ ప్యాకెట్‌లో ఉంటుంది. అంటే ఒక కిలో మామూలు రకం పొడరు ఉతికేటన్ని బట్టల్ని అర కిలో సర్ఫ్ ఉతుకుతుందన్నమాట. చూశారా, సర్ఫ్ నుంచి మీరు ఎంత విలువ పొందుతున్నారో?"



ఒక కిలో మామూలు రకం పొడరు



½ కిలో సర్ఫ్

**అంటే, ఒక విధంగా, సర్ఫ్ తన ధర తిరిగి చెల్లిస్తుందన్నమాట!**

"ఒక విధంగా ఏమిటి, ఎన్నో విధాలుగా! మనకు లాభమే లాభం. చౌక రకంవి కొనడంలోనూ మంచి నాణ్యమైనది కొనడంలోనూ ఎంతో తేడా ఉంది. అందుకే అంటున్నాను. సర్ఫ్ కొనడంలో మరింత వివేకం ఉందని."





మామూలు డిస్టెంపర్‌కి
జెన్సన్ అండ్ నికల్సన్
చేసిన గమ్మత్తు యిది-





ఏక్రలిక్‌తో చేసిన ఇంద్రజాలం
యిది.

పెయింట్ల సాంకేతిక ప్రావీణ్యంలోని అధునికతను అందిస్తోంది జెన్సన్ & నికల్సన్. జెన్సొలిన్ ఏక్రలిక్ వాషబుల్ డిస్టెంపర్ మాత్రమే అందిస్తుంది— అద్భుతమైన ఫినిష్, అసలైన రంగులు, అతి త్వరగా కోటింగ్ చేసే వీలు. మిగతా ఆయిల్ బౌండ్ డిస్టెంపర్ల దొరికే ఖరీదుకే.

జెన్సొలిన్ ఏక్రలిక్ వాషబుల్ డిస్టెంపర్. అత్యుత్తమమైన డిస్టెంపర్, అధికమైన ధర పెట్టకుండానే.

JN జెన్సన్ అండ్ నికల్సన్




Rediffusion/JN/4932 g TL







Ready for blast off—9, 8, 7, 6, 5, 4, 3, 2, 1....! Just pick 'em up and stick' em up. Chinar has got it all for you. Hundreds of varieties of stamps on space covering USSR's space programme... An irresistible collection specially imported for genuine collectors like you.

**Choose from over 20 themes**

Special packets have been made for you under various themes or topics ranging from stamps on space, sports, animals, transport, art, flowers etc. (see cpupon for details) to add to your collection. Take your pick.

**Send the coupon or simply write to us**

You can either fill in the coupon or choose your favourite topic and write to us on a postcard, inland letter or on plain paper.

- If you order by VPP, minimum order should be Rs. 50.00 + Rs. 7.00 for postage.
- If you pay in advance, minimum order should be Rs. 25.00 + Rs. 5.00 for postage.
- Please add 10% Sales Tax on value of stamps for all orders. (only 7% for Delhi).
- Postage will be free on all orders of Rs. 100.00 or above.
- For VPP orders, make sure of your parents permission.

**Hurry! Mail your order today:**

**Circle the packets you want**

| Themes | stamps 10 | 25 | 50 | 100 |
|---|---|---|---|---|
| Space | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Sport | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Transport | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Art | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Flowers | 3.75 | 8.00 | 15.00 | — |
| Fauna | 3.75 | 8.00 | 15.00 | — |
| Marine/Sea life | 3.75 | 8.00 | 15.00 | 30.00** |
| *Paintings* | 3.75 | 8.00 | 15.00 | — |
| Lenin | 3.75 | 8.00 | 15.00 | 25.00** |
| Flora & Fauna | — | — | — | 35.00 |
| Moscow | — | — | — | 30.00 |
| Siberia & Far East | — | — | 30.00*** | — |
| Peace & Friendship | — | 8.00 | — | 25.00 |
| October Revolution | 3.75 | — | — | 25.00 |
| Assorted | 3.75 | 8.00 | 15.00 | 25.00 |

** 90 stamps ** 85 stamps *** 53 stamps*

Name.................................. Age..........
Address..............................................
.....................................................
.....................................................
Payment □ V.P.P. order □

**CHINAR-Sole distributors and importers of USSR stamps for genuine collectors**




*STAMPS The hobby that sticks with you.*



CHINAR EXPORTS PVT LTD
Regd Office : 101-A, Surya Kiran
Kasturba Gandhi Marg, New Delhi-110 001

INK CE 883

# చందమామ

నంస్థాపకుడు : 'చ క్ర పా ణి'

నంచాలకుడు : నా గి రె డ్డి

ఈ నెల బేతాళకథ ["సాహసవీరుడు"]కు ఆధారం, ''వసుంధర'' రచన.

బతుకుతెరువు కోసం మనిషి, ఏదో ఒక వృత్తిని చేబట్టవలసివస్తుంది. అయితే, అందరూ అన్ని వృత్తులకూ పనికిరారు. వృత్తిసామర్థ్యం లేనివాడు, నష్టాలపాలవడం తప్ప, అందులో రాణించలేడు. ''స్వార్థచింతన'' అన్న కథలో, ఇది చక్కగా నిరూపించబడింది.

## అమరవాణి

కరావివ శరీరస్య, నేత్రయోరివ పక్ష్మణీ,
అవిచార్య ప్రియం కుర్యాత్, తన్మిత్రం మిత్రముచ్యతే.

[చేతులు శరీరానికి ఉపయోగపడేలా, రెప్పలు కళ్ళను కాపాడే విధంగా, ఆపదసమయంలో స్నేహితులు అడగకుండానే నహాయం చేస్తారు.]

సంపుటి 79 నవంబర్ '86 సంచిక 5

విడి ప్రతి : 2–50 : : నంవత్సర చందా : 30–00






## చందమామ కబుర్లు



### ఉత్తమ నేస్తం!

నేపిల్స్‌లో హఠాత్తుగా ఒక ఇంటికి నిప్పు అంటుకున్నది. ఆ ఇంటిని కాచుకున్న రాకీ అనే జర్మనీ కుక్క, తన యజమాని అయిన మూడేళ్ళపాపను కాపాడడానికి మంటల్లోకి దూకి ఆమె దుస్తులూ, కాళ్ళూ పట్టుకుని బయటకు లాక్కువచ్చింది. మంటలలో చిక్కుకుపోయిన మరి కొందరిని రక్షించే ప్రయత్నంలోనే ఆ కుక్క మంటలకు ఆహుతి అయిపోయింది।

### నెపోలియన్ నౌక

నైలుయుద్ధానికి ఒకనెల పూర్వం 1798 వ సంవత్సరం జూలై 4 వ తేదీన నెపోలియన్‌బోనపార్ట్‌కు చెందిన 'లే పేట్రియట్' అనే నౌక ఈజిప్టు సముద్రతీరంలో మునిగిపోయింది. 188 సంవత్సరాల అనంతరం, మునిగిపోయిన ఆ నౌకను ఫ్రెంచి పరిశోధకులు కనుగొన్నారు।





### ఫోటోలు తీసే ఫోన్!

క్షణాల మీద ఫోటో తీసి, ఒకరి ఫోటోను మరొకరికి పంపే సరికొత్త టెలిఫోన్ ఇటీవల రూపొందించబడి ఉన్నది।

పురాణగాథలు :

# చోళరాజు - విష్ణుదాసు

కాంచీపురాన్ని పరిపాలించిన చోళరాజు గొప్ప విష్ణుభక్తుడు. ఒక పర్వదినాన, రత్నహారాలతో, స్వర్ణ పుష్పాలతో రాజు విష్ణుమందిరానికి వెళ్ళాడు. అంతకు ముందే విష్ణుదాసు అనే ఒక పేదభక్తుడు, విష్ణు విగ్రహాన్ని తులసీదళాలతో అలంకరించి ఉన్నాడు. పుణ్యదినాన కూడా దేవుణ్ణి ఇలా అతిసామాన్యంగా అలంకరించవచ్చా? అని రాజు ఆగ్రహం చెందాడు. ఆ తరవాత స్వర్ణాభరణాలతో విగ్రహాన్ని అలంకరించి, దానధర్మాలు చేసి, ఘనంగా పూజలు జరుపసాగాడు.

విష్ణుదాసు ఒక నిర్జన ప్రదేశానికి వెళ్ళి, విష్ణువిగ్రహాన్ని ప్రతిష్ఠించి, భిక్షమెత్తగా వచ్చిన బియ్యం వండి, ఆ విగ్రహానికి నైవేద్యం పెట్టి అర్చిస్తూ రాసాగాడు. పూజానంతరం ధ్యానంలో ఉన్న సమయంలో ఎవరో వచ్చి నైవేద్యాన్ని అపహరించుకునిపోవడం విష్ణుదాసు గమనించాడు. ఒకనాడు ధ్యానంలో కూర్చుని, మధ్యలోనే కళ్ళు తెరిచిచూశాడు. బీదవాడొకడు అక్కడికి వచ్చి, పట్టుబడి పోతామన్న భయంతో, ప్రసాదం ముట్టుకోకుండా అక్కడి నుంచి పరిగెత్తసాగాడు. విష్ణుదాసు ప్రసాదం చేతపట్టుకుని అతణ్ణి పిలుస్తూ అతని వెంటబడ్డాడు. అతడు కొంత దూరం పరిగెత్తి, ఆపైన పరిగెత్త లేక, వీధిలో పడిపోయి స్పృహ కోల్పోయాడు. విష్ణుదాసు జాలితో అతని ముఖం మీద నీళ్ళు చల్లాడు. అతడు మెల్లగా కళ్ళు తెరిచాడు. మరుక్షణమే విష్ణువు ప్రత్యక్షమై, విష్ణుదాసును కౌగిలించుకుని తనలో ఐక్యం చేసుకున్నాడు!

ఈ విషయం తెలిసిన చోళరాజు, తాను చేసిన యజ్ఞయాగాలకు, దానధర్మాలకు ఫలితం ఎక్కడ? దానధర్మాలు ఏవీ చేయకుండానే ఆ బీదవాడు దేవుడి దయకు పాత్రుడయ్యాడే! అని చింతించి, విరక్తితో ప్రాణత్యాగానికి పూనుకున్నాడు. అప్పుడు విష్ణువు ప్రత్యక్షమై, "రాజా! ఆ పేదవాడూ, నువ్వూ ఇద్దరూ నా భక్తులే. మీమీ శక్త్యనుసారం మీరు నన్ను ఆరాధించారు. అయితే నీలో కొంత అహం ఉండేది. దానిని పోగొట్టడానికే ఇలా చేశాను!" అని ఆశీర్వదించాడు!





# పెళ్లిషరతు

వసంతగిరి రాజైన చంద్రకాంతుడు యువకుడు; అవివాహితుడు. అతడు ఒక నాటి సూర్యోదయం వేళ, ఒంటరిగా గుర్రం మీద, దాపులనున్న అరణ్యానికి వాహ్యాళికి వెళ్ళాడు. అక్కడ ఒకచోట, కొలనులో స్నానం చేసి, గూడెం కేసి వెళుతున్న, ఒక చెంచుయువతి, అతడి కంటబడింది. ఆమె సౌందర్యం, ముఖంలోని నిర్మలత్వం, అతణ్ణి బాగా ఆకర్షించాయి.

చంద్రకాంతుడు రాజప్రాసాదానికి తిరిగి వచ్చాడు. అతడిలో, ఆ చెంచు యువతిని వివాహమాడాలన్న కోర్కె బల పడసాగింది. అయితే, ఒక దేశానికి రాజయిన తను, ఇలాంటి వివాహం చేసుకోవడం, భావ్యంగా వుంటుందా అన్న సంశయం కలిగింది.

రాజు అన్యమనస్కంగా వుండడం చూసిన మంత్రి దేవవర్మ, అతణ్ణి, ''మహారాజా, తమరేదో సమస్య గురించి దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టున్నది. అదేమిటో, నేను వినవచ్చునా?'' అని అడిగాడు.

చంద్రకాంతుడు దాపరికం లేకుండా, అరణ్యంలో తను చూసిన చెంచుయువతి గురించి చెప్పి, ''ఆమెను వివాహమాడాలన్న గాఢమైన కోర్కె, నాలో కలిగింది. కాని, ఒక దేశానికి పరిపాలకుడనైన నేను, ఆ పని చేయడం ఎంతవరకు, ధర్మసమ్మతంగా వుంటుందని, ఆలోచిస్తున్నాను,'' అన్నాడు.

మంత్రి ఒక క్షణకాలం ఆలోచించి, ''ఇందులో ధర్మాధర్మాల చర్చకు తావు లేదు, మహారాజా!'' అని, రాజు కిరీటంలోని వజ్రాన్ని చూపిస్తూ, ''ఒకప్పుడు అదీ మట్టిలో వున్నదే! సానబట్టిన కారణంగా దానికి విలువవచ్చి, తమ కిరీటాన్ని అలంకరించింది. మీరు సంవత్సరం తిరగ

మాచిరాజు కామేశ్వరరావు

కుండా, ఆ చెంచుయువతికి రాచమర్యాదలన్నీ నేర్పవచ్చు. పైపెచ్చు మీరామెను వివాహం ఆడడం, ప్రజలకు ఆదర్శప్రాయంగా వుంటుంది. రేపే నేను, పరివారంతో చెంచుగూడెం వెళతాను,'' అన్నాడు.

మంత్రి ఇలా అనగానే చంద్రకాంతుడు తృప్తిపడి, ''మీరు వెళ్ళడం కాదు; నేనే వెళతాను. నేనామెను చూశాను, ఆమె కూడా నన్ను చూడాలి గదా!'' అన్నాడు

మర్నాడు చంద్రకాంతుడు బయలుదేరి చెంచుగూడెం వెళ్ళాడు. ఆ చెంచు యువతి, గూడెం పెద్ద కుమార్తె. పేరు చంపకవల్లి.

చెంచుపెద్ద, రాజుకు తగిన మర్యాదలు చేసి, ''మహారాజా, స్వయంగా తమరు మా గూడేనికి రావడం సంతోషంతోపాటు, ఆశ్చర్యం కలిగిస్తున్నది. తమ రాకకు కారణం అడగవచ్చునా?'' అన్నాడు.

చంద్రకాంతుడు తలుపుపక్కన నిలబడి వున్న చంపకవల్లిని చూపుతూ, ''ఆమెకు ఇష్టం అయితే, నేను వివాహం ఆడదలిచాను. ఈ సంగతి చెప్పేందుకే నేనిక్కడికి రావడం జరిగింది,'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే చంపకవల్లి లోపలికి పోయింది. చెంచు పెద్ద కూడా లోపలికిపోయి, కుటుంబ సభ్యులతో మాట్లాడి, తిరిగి వచ్చి, రాజుతో, ''క్షమించండి, మహారాజా! ఈ వివాహం జరగడం



కష్టసాధ్యం. వివాహం జరిగినా, చంపమీతో రాదు, ఇక్కడే వుంటుంది. తమకు సమ్మతమేనా ?'' అని అడిగాడు

ఆ ప్రశ్నకు చంద్రకాంతుడు ఆశ్చర్య పోతూ, ''వివాహం అయాక, నా భార్య నాతో రాజప్రాసాదానికి రాకపోతే, ఇక ఆ వివాహానికి అర్థమే వుండదు,'' అని చెప్పి, నగరానికి తిరిగి వచ్చాడు.

సంగతి విన్న మంత్రి దేవవర్మకు ఎక్కడలేని కోపం వచ్చింది. ఆయన, రాజును, ''తమకింకా, ఆమెను వివాహం ఆడాలని వున్నదా ?'' అని అడిగాడు.

అందుకు చంద్రకాంతుడు, అవు నన్నట్టు తల ఊపి, ''ఆమె తండ్రి పెట్టిన షరతు మాటేమిటి ?'' అన్నాడు.

మంత్రి, ఆ ప్రశ్నకు ఏ జవాబూ ఇవ్వకుండా, కొంచెంసేపు దీర్ఘంగా ఆలోచిస్తూ పూరుకుని, ''సెలవిప్పించండి, మహారాజా !'' అని అక్కడి నుంచి వెళ్ళి పోయాడు.

ఆ మర్నాటి ఉదయం మంత్రి, చంద్ర కాంతుణ్ణి ఉద్యాన విహారానికి రావలసిందిగా కోరాడు.

ఇద్దరూ ఉద్యానంలో తిరుగుతూండగా, ఒకచోట పరిచారికలమధ్య, రాచకన్య అలంకరణలో కూర్చునివున్న చంపకవల్లి, రాజు కంటబడింది.

చంద్రకాంతుడుఆశ్చర్యపోతూ, మంత్రి కేసి చూశాడు. మంత్రి చిన్నగా నవ్వి, ''మహారాజా, రాత్రి సాయుధులైన కొందరు



భటుల వెంట, నలుగురు దాసీలను పంపి, ఈమెను చెంచుగూడెం నుంచి, ఇక్కడకు తెప్పించాను. ఈమె తండ్రి గాని, ఇతర గూడెం చెంచులుగాని, భటులను ప్రతిఘటించేందుకు ఎలాంటి ప్రయత్నం చేయలేదు. దేశపాలకుడి కోర్కెను తిరస్కరించడం, ఎంత గొప్ప నేరమో వాళ్ళు గ్రహించి వుంటారు,'' అన్నాడు.

మంత్రి చేసిన పనికి, చంద్రకాంతుడు చాలా బాధపడుతూ, ''మీరిలా చేసి వుండవలసినది కాదు. బలప్రయోగంతో, ఎవరిచేతా ఇష్టం లేని పని చేయించకూడదు. ఈ సాయంత్రమే, నేను స్వయంగా ఆమెను తీసుకుపోయి, తండ్రికి అప్పగిస్తాను,'' అన్నాడు.

అన్నప్రకారం చంద్రకాంతుడు, చంపకవల్లిని గూడెం తీసుకుపోయాడు. ఆమె తండ్రి బంధుగణంతో వచ్చి, అతడికి స్వాగతం పలికి, "మహారాజా, మీ ప్రేమను పరీక్షించేందుకే, పెళ్ళికి షరతు పెట్టాను. మీరు మొట్టమొదటిసారిగా ఇక్కడికి వచ్చినప్పుడు, నా కుమార్తెకు ఇష్టం అయితే పెళ్ళాడతానన్నారు. అప్పుడే నాకు, తమ మంచితనం అర్థమైంది. కాని, తీరా పెళ్ళి అయాక—నా కుమార్తె పట్టమహిషిగా అర్హురాలు కాదని అంటారేమో అన్న భయం కలిగింది. అందువల్లనే, బాధ్యతగల తండ్రిగా, మీకు ఆ షరతు పెట్టాను. ఏస్త్రీకైనా భర్త తోడిదేలోకం. ఆ సంగతి, నాకు తెలియంది కాదు,'' అన్నాడు.

ఇది విన్న చంద్రకాంతుడు పరమానందం చెందాడు. కొద్ది రోజుల తర్వాత, అతడికి చంపకవల్లితో వైభవంగా వివాహం జరిగింది.

అంతవరకు చదువుసంధ్యలూ, రాచమర్యాదలూ ఏమాత్రం తెలియని చంపకవల్లి, సంవత్సరం తిరక్కుండానే గురువులవల్ల తగిన శిక్షణ పొంది, రాజుకు తగిన పట్టమహిషి అన్న పేరు తెచ్చుకున్నది.






సింగవరం అనే గ్రామంలో, రంగరాజు అనే భూస్వామి, గ్రామానికి మధ్య రెండంతస్తుల మేడలో కాపురం వుంటున్నాడు. ఆయన మేడకు పక్కనే, పాతబడిపోయిన పెంకుటిల్లొకటి వున్నది. అది శివయ్య అనే పేదవాడిది.

శివయ్యలాంటివాడు, తన పొరుగు కావడం, రంగరాజుకు చాలా కోపంగా వుండేది. ఆయన వాణ్ణి ఏదోవిధంగా, ఆ ఇంట్లోనుంచి తరిమెయ్యాలని ప్రయత్నిస్తూండేవాడు.

''ఒరేయ్, నీ దిక్కుమాలిన కోళ్ళు, నా పెరట్లోని మొక్కలూ, పాదులూ కెలికి పాడుచేస్తున్నవి!'' అని ఒకరోజూ, ''నీ ఇంటినుంచి వస్తున్న కుళ్ళునీరంతా, నా మేడముందు ప్రవాహం కట్టిపోతున్నది, జాగ్రత్త!'' అని మరొకరోజూ శివయ్యమీద కేకలు వేస్తూండేవాడు.

శివయ్యకు, భూస్వామి రంగరాజు ఎత్తుగడ తెలుసు. వాడు అక్కడా, ఇక్కడా కూలినాలి చేసుకుంటూ, తాత తండ్రులు వదిలిపోయిన, పాత పెంకుటింట్లో, భార్యాబిడ్డలతో కాలం గడుపుతున్నాడు. ఆ ఇల్లు రంగరాజుకు అమ్మడం జరిగితే, ఇక ఆ గ్రామంలో వాడికి తల దాచుకునేందుకు ఆశ్రయం దొరకదు.

తన కేకలకూ, బెదిరింపులకూ శివయ్య లొంగి రాకపోయేసరికి, రంగరాజు ఒక నాడు బాగా ఆలోచించి, శివయ్యను తన ఇంటికి పిలిపించి, ''ఒరేయ్, నువ్వు పెంచే కోళ్ళూ కొక్కెరాయిలవల్లేకాదు, నీ పిల్లలవల్ల కూడా, నా ఇంట్లో ప్రశాంతత లేకుండా పోతున్నది. మీవాళ్ళ అరుపుల కారణంగా నాకు సరిగా నిద్రపట్టడం లేదు, పూజకూడా భంగం కలుగుతున్నది. నీ కొంప కాలిపోతే తప్ప, ఈ

జొన్నలగడ్డ రత్న



ఈతిబాధలు నాకు తప్పేలా లేవు,'' అన్నాడు కోపంగా.

కొంప కాలిపోవడం అన్న రంగరాజు మాటల్లోని సూచన గ్రహించిన శివయ్యకు ఆయన తలచుకుంటే అంత పనీ చేయించ గలడన్న నమ్మకం కలిగింది. ఇక అలాంటి పొరుగువాడు పెట్టే బాధలు సహించడంకన్న, గ్రామం వదిలిపోవడమే క్షేమమనుకుని, వాడు అడిగిన ధరకు ఇంటిని రంగరాజుకు అమ్మి, భార్యా బిడ్డలతో ఎటో వెళ్ళిపోయాడు.

కొంతకాలం జరిగాక, రంగరాజుకు ఉన్నట్టుండి, కొన్నాళ్ళపాటు పట్నవాసం చేయాలన్న కోరిక కలిగింది. ఆయన పట్నంలో నలుగురూ మసిలే నడివీధిలో, అమ్మకానికి వచ్చిన ఇల్లొకటి కొని, కాపరం అందులోకి మార్చాడు.

రంగరాజు, ఆ ఇంట్లో దిగిన మర్నాడే పక్క ఇంటిలో ఏదో కోలాహలం ప్రారంభమై, జనం మూగడం గమనించాడు. అక్కడేం జరుగుతున్నదో చూద్దాం అన్న కుతూహలంతో, ఆయన ఆ ఇంటి ముందుకు వెళ్ళాడు.

అక్కడ చేరిన గుంపులో ఒకణ్ణి, రంగరాజు ఏం జరుగుతున్నదని అడిగాడు. దాని కతను, "ఈ ఇంటి యజమాని బోలెడు ధర పెట్టి, ఈ ఇల్లు కొన్నాడు. అయినా, ఒక్క రోజు కూడా అతను, ఈ ఇంట్లో ప్రశాంతంగా కాలం గడపడం అంటూ జరగ లేదు. ఇంటిని ఒక దయ్యం పట్టి పీడిస్తున్నది. ఎన్ని మంత్రతంత్రాలు ప్రయోగించినా, అది ఇంటిని వదిలిపోవడం లేదు. ఇంటి యజమాని, ఆఖరి ప్రయత్నంగా, మలయాళ దేశం నుంచి వచ్చిన, ఒక గొప్ప మంత్రగాణ్ణి పిలిపించాడు. ఈ గొడవంతా అదే!'' అని చెప్పాడు.

రంగరాజు ముందుకుపోయి, ఇంట్లో జరుగుతున్న తతంగం చూడసాగాడు. మలయాళ మంత్రగాడు దయ్యాన్ని పార దోలడానికి అవసరం అయిన హంగామా అంతా సమకూర్చుకుని, ఇంటి యజమా

నితో, ''శేషాచలంగారూ, మీరేం కంగారు పడకండి! మీ దురదృష్టం కొద్దీ ఇంటికి దయ్యం పీడపట్టింది; అయితే, అదృష్టం కొద్దీ నేను ఇక్కడికి రావడం జరిగింది. నాతాంత్రికపూజ పూర్తయేసరికి, దయ్యం ఊరి పొలిమేరలు వదిలి పారిపోవలసిందే,'' అన్నాడు.

శేషాచలం దిగులుగా అక్కడ చేరిన వాళ్ళ కేసి చూస్తూ, ''నిజానికిది, నా దురదృష్టం కాక మరేమిటి! నేను నిక్షేపం లాంటి, ఈ ఇంటి పక్కనున్న ఇల్లే కొనవలసింది. నా రోజులు బాగోక— ఎవరో రంగరాజనే శ్రీమంతుడు, రెట్టింపు ధర యిచ్చి, దాన్ని కొనేశాడు. ఇదే, నా ఆఖరి ప్రయత్నం! ఇంటినిపట్టిన దయ్యం వదలకపోతే, నేనే ఇంటిని గాలికి వదిలేసి లేచిపోతాను,'' అన్నాడు.

శేషాచలం మాట ముగించగానే, ఇంటిని పట్టిన దయ్యం ఉరుములాంటి గొంతుతో, ''ఏమిటీ! పక్క ఇంటిని రంగరాజు కొన్నాడా? రంగరాజంటే, సింగవరంలో వుండే రంగరాజు కాదు గదా?'' అని అడిగింది.

దయ్యం మాటలకు అక్కడ చేరిన వాళ్ళందరూ భయభ్రాంతులయ్యారు. మంత్రగాడు శేషాచలం కేసి ఆశ్చర్యంగా చూశాడు.



శేషాచలం మంత్రగాడితో, ''అవును, పక్క ఇంటిని కొన్నది సింగవరం నుంచి వచ్చిన, రంగరాజే!'' అన్నాడు.

ఆ మరుక్షణం దయ్యం కీచుగొంతుతో, ''అలాగా! అయితే, నేనీ ఇల్లే కాదు; ఈ పరిసరాలే వదిలి వెళతాను,'' అన్నది.

మంత్రగాడు గర్వంగా మీసం మెలివేసి అందరి కేసి చూస్తూ, ''చూశారా! నేనింకా దయ్యం భరతం పట్టేందుకు మంత్రాలే చదవలేదు. అప్పుడే అది హడలి పారిపోతున్నది,'' అన్నాడు.

ఆ మాటలకు దయ్యం పెద్దగా వికటాట్టహాసం చేసి, ''మూర్ఖా! నేనీ ఇల్లు వదలాలనుకోవడానికి కారణం, నీ మంత్ర

తంత్రా లేమీ కాదు. నా పేరు శివయ్య. నేను బతికున్న రోజుల్లో, ఈ రంగరాజుకు పొరుగున వున్న ఇంట్లో వుంటూ, ఇతడు పెట్టిన నరకయాతనలన్నీ అనుభవించాను. నేనూ, నా కుటుంబం చెల్లాచెదరైపోయి, నేను దిక్కుమాలిన చావుకు గురి అయాను. పోరుపెట్టే ఇరుగుపొరుగు వాళ్ళు, ఇళ్ళను పట్టి పీడించే దయ్యాలకన్న అధములు. రంగరాజు ఇక్కడ చేరాడు గనక, ఈ సంగతి త్వరలోనే మీరు గ్రహిస్తారు!'' అన్నది.

ఆ వెంటనే ఇంటి మధ్య పెద్ద సుడిగాలి లేచింది. దాని తాకిడికి మంత్రగాడి ముందున్న పూజాసామగ్రి పళ్ళాలతోపాటు పైకి లేచి, చెల్లాచెదురుగా పడిపోయింది. మంత్రగాడు భయంతో వణికిపోతూ, మంత్రోచ్చారణ ప్రారంభించాడు. అయితే, ఈలోపలే దయ్యం సుడిగాలితో పాటు కిటికీలోంచి బయటికి వెళ్ళిపోయింది.

జనంలో కొందరు రంగరాజు కేసి చూస్తూ గుసగుసలు ప్రారంభించారు.

ఇది గమనించిన రంగరాజు, ''దయ్యం చెప్పిన రంగరాజును—ఒకవేళ నేనే నేమో అన్న శంక కలుగుతున్నది. ఏమైనా, ఇదేదో తంపులమారి దయ్యం. మనుషుల్లోనే నిజాయితీ అంతంత మాత్రంగా వున్న ఈ రోజుల్లో, దయ్యాల నిజాయితీ సంగతి పట్టించుకోనవసరం లేదు,'' అన్నాడు.

''ఆ మాట నిజమే! ఆ మాట్లాడింది శివయ్య దయ్యమో, సీనయ్య దయ్యమో, మనకేం తెలుసు? మంత్రగాడి శక్తిని కొంచెపరిచేందుకు, అది నోటికొచ్చినట్టు పేలి వుంటుంది,'' అన్నాడు జనంలో నుంచి ఒకడు.

అవునన్నట్టు కొందరు తలలు ఊపారు. అయితే, రంగరాజు మాత్రం సిగ్గుతో, అవమానభారంతో తల వంచుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

ఆ తరవాత, ఆయన ఇరుగు పొరుగులతో సఖ్యంగా వుంటూ, అందరిచేతా మంచివాడనిపించుకున్నాడు.






## 7

[ఉగ్రాక్షుడికి దొరికిపోయిన అమరపాలుడు, చిత్రసేనుడితో జ్వాలాద్వీప వాసులను గురించిన కొన్ని రహస్యాలు చెప్పాడు. రాజద్రోహి నాగవర్మను గురించి కూడా కొన్ని రహస్యాలు చిత్రసేనుడికి తెలిసినై. ఆ ద్రోహికి సహాయం చేస్తున్న పులిరాయుళ్ళనూ, వాళ్ళ భయంకర పక్షుల్నీ కొట్టాలకు నిప్పుపెట్టి సర్వనాశనం చేస్తానని అమరపాలుడు అన్నాడు. తరవాత—]

అమరపాలుడి మాటలు వింటూనే చిత్రసేనుడు ఉగ్రాక్షుడి కేసి చూశాడు. ఉగ్రాక్షుడికి అమరపాలుడి మాటల్లో పూర్తి విశ్వాసం కలిగింది. అతడు ఉత్సాహంగా లేచి నిలబడి, "నా సేవకులైన రాక్షసుల్లో ఇద్దరు ముగ్గుర్ని తోడుగా పంపుతాను. ఈ పని సానుకూలం అయితే, అమరపాలుణ్ణి గొప్పగా బహూకరించగలను," అన్నాడు.

చిత్రసేనుడు ఓ క్షణకాలం ఆలోచించి, "పనిలో పనిగా, ఆ కపిలపురాన్ని కూడా ఆక్రమించుకోవటం బావుంటుంది గదా? రాజును చెరపట్టిన సేనాని నాగవర్మ, నా తండ్రిగారి రాజ్యమైన ధవళగిరి మీదికి దాడి వెళ్ళాడు. ఇప్పుడు కపిలపురానికి రక్షణగా పెద్ద సైన్యం వుండి వుండదు. మనం హఠాత్తుగా దాడిచేస్తే కపిలపురం కోటను ఆక్రమించుకోవచ్చు." అన్నాడు.



చిత్రసేనుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు ఎగిరి గంతేసి, "మహా పసందైన ఆలోచన, చిత్రసేనా! మనం కపిలపురాన్ని ఆక్రమించుకోవటమే గాదు, వీరసింహ మహారాజు కుమార్తె కాంతిమతిని కూడా, నాగవర్మ పాలుకాకుండా కాపాడదాం. నువ్వు యువకుడివి, బ్రహ్మచారివి. ఒక్క వేటుతో నీ రాజ్యం రెండింతలు కావటమే గాక, గొప్ప సౌందర్యవతి అయిన రాజకుమార్తె కూడా నీకు భార్య అవుతుంది," అన్నాడు.

ఉగ్రాక్షుడి మాటలు చిత్రసేనుడికి ఏవగింపు కలిగించినై. కపిలపురం రాజైన వీరసింహుడు బతికి వుండగానే, అతడి రాజ్యాన్ని తన రాజ్యంలో కలుపుకోవటం గాని, అతని కుమార్తెను తండ్రి అనుమతి లేకుండా వివాహం ఆడటం గాని న్యాయం అనిపించుకోదు. పైగా ఆ కాంతిమతి ఈసరికే మరొక వరుణ్ణి ఎన్నుకుని వుండవచ్చు. రాక్షసుడైన ఉగ్రాక్షుడికి మానవులు పాటించే మంచీ మర్యాదల గురించి ఏమీ తెలియదు.

"ఉగ్రాక్షా! ఇప్పటి మన ప్రయత్నం నాగవర్మను ఓడించటం. ఆ విధంగా త్వరలో మనకు పక్కలో బల్లెమైన ఒక దుష్టుడి పీడ విరగడ అవుతుంది. కపిలపుర రాజ్యానికి వీరసింహుణ్ణే తిరిగి రాజుగా పట్టాభిషేకం చేస్తాం. కాని, ఇవన్నీ సాధించాలంటే ముందుగా మనం ఆ భయంకర పక్షుల్ని, వాటి రౌతుల్ని తుదముట్టించాలి. వాళ్ళు ఆ రాజ్యం పొలిమేరలలో వుండగా మనం ఎంత పెద్ద సైన్యంతో వెళ్ళినా కపిలపురాన్ని ఆక్రమించుకోలేం సరిగదా, మనమే వాళ్ళ చేతుల్లో తప్పక సర్వనాశనం అవుతాం," అన్నాడు చిత్రసేనుడు.

"ఆ బాధ్యత నా మీద పెట్టండి. మీరు సైన్యాలతో అడవిలో దాగివుండి, భయంకర పక్షులు కొట్టాల్లో మాడి చావగానే, కపిలపురం మీద దాడి చెయ్యవచ్చు," అన్నాడు అమరపాలుడు.

ఇందుకు చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ అంగీకరించారు. వెంటనే అమరపాలుడికి తోడుగా ఇద్దరు రాక్షసులూ, నలుగురు చిత్రసేనుడి సైనికులూ బయలుదేరారు. అమరపాలుడు వాళ్ళను వెంటబెట్టుకుని చూస్తూండగానే అడవిచెట్లలో మాయమయాడు. చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ తమ సైన్యాలనూ, అనుచరులనూ సమాయత్తం చేసేందుకు భటుల ద్వారా ఆజ్ఞలు పంపారు.



ఈలోపల అమరపాలుడు సైనికుల్ని వెంటపెట్టుకుని, అడవిదారుల వెంట ప్రయాణిస్తూ మిట్టమధ్యాహ్నం వేళకు, కపిలపురం సమీపాన గల అడవిని చేరాడు. ఆ అడవిలోనే దాదాపు నూరు భయంకర పక్షులు పెద్ద పెద్ద కొట్టాలలో కట్టివేయబడి వున్నవి. వాటిని కాపలా కాసేవాళ్ళు ఆ సమీపంలోనే చిన్న చిన్న గృహాల్లో వుంటున్నారు.

అమరపాలుడు తన అనుచరులందర్నీ ఒకచోట చేర్చి, వారికి కాపలావాళ్ళుండే గృహాలు చూపుతూ, "నేను ఈ ప్రాంతమంతా బాగా ఎరిగినవాణ్ణి. ఆ కాపలావాళ్ళల్లో కూడా ప్రతి ఒక్కడూ నాకు తెలుసు. నేను ముందుగా వాళ్ళ దగ్గిరకు వెళ్ళి అందర్నీ ఒకచోట చేర్చుతాను. ఆ సమయంలో మీరు హఠాత్తుగా వాళ్ళ మీద పడి నిర్దాక్షిణ్యంగా చంపేయండి. ఆ తరువాత భయంకర పక్షులున్న కొట్టాలకు నిప్పు పెడదాం," అన్నాడు. ఇందుకు అందరూ సరేనన్నారు. తరవాత అమరపాలుడు కాపలావాళ్ళ గృహాలకేసి పరిగెత్తుతూ కేకలు పెట్టాడు. ఆ కేకలు వింటూనే కాపలావాళ్ళు ఇళ్ళల్లో నుంచి బయటికి వచ్చి, అమరపాలుణ్ణి చుట్టుముట్టారు. వాళ్లు అందరూ కలిసి దాదాపు ఇరవైమందికన్న ఎక్కువ వుండరు.

"అమరపాలా! బతికి బయటపడ్డావా? నువ్వు ఆ రాక్షసుల చేతిలో చిక్కి చచ్చిపోయావని మేమంతా అనుకున్నాం," అన్నారు వాళ్ళు.




''చావవలసినవాణ్ణే, కాని భూమి మీద ఇంకా నూకలుండి ప్రాణాలతో పారిపోయి ఇక్కడికి రాగలిగాను. ఎన్ని జిత్తులు ప్రయోగించి వాళ్ళ వలలో పడకుండా బయటపడ్డానో, ఆ పరమాత్ముడికే ఎరుక. పక్షుల్లో ఏ ఒకటీ చావకుండా, అన్నీ కొట్టాలకు చేరినయ్యా ?'' అన్నాడు అమరపాలుడు.

''అన్నీ సురక్షితంగానే వున్నవి. నాగవర్మ మహారాజు ధవళగిరి మీదికి దండు వెడలాడు. ఇప్పుడు కపిలపురానికి రక్షకులం మనమే. కోటలో కొద్దిమంది భటులు మాత్రమే వున్నారు. వారైనా కోట రక్షణకన్న రాజకుమార్తె కాంతిమతి పారిపోకుండా చూసేందుకే వుంచబడ్డారు. నాగవర్మరాజు సర్వసైన్యాల్ని వెంటబెట్టుకుని ముందు ధవళగిరినీ, ఆ తరవాత అడవిలో వున్న చిత్రసేనుడి కోటనూ ఆక్రమించుకుని—అంతా ఓ చుట్టుచుట్టి ఇక్కడికి వస్తారు. ఆ తరవాత మనలో ప్రతి ఒక్కడూ ఒక సామంతరాజవుతాడనుకో,'' అన్నారు వాళ్ళు.

ఆ మాటలు వింటూనే అమరపాలుడు పరమానందం చెందినవాడిలా పెద్దగా నవ్వి, గంతులు వేస్తూ చేతులు పైకెత్తి సంజ్ఞలు చేశాడు. మరుక్షణంలో చెట్ల చాటు నుంచి భయంకరంగా రంకెలు వేస్తూ రాక్షసులూ, సైనికులూ పరుగెత్తుకుని వచ్చి కాపలావాళ్ళ మీద పడ్డారు. అదే అదనులో అమరపాలుడు కూడా కత్తి దూసి, కాపలావాళ్ళయిన జ్వాలాద్వీపవాసుల్ని నరకసాగాడు. నిరాయుధులుగా వున్న ఆ క్రూరులు నిమిషాల మీద యమపురికి ప్రయాణం కట్టారు.

ఆ వెంటనే అమరపాలుడూ, రాక్షసులూ ఇళ్ళలోకి జొరపడి నూనెలో ముంచిన కాగడాలను వెలిగించి, భయంకర పక్షులు కట్టివేయబడి వున్న తాటాకు కొట్టాలకు అన్ని వైపుల నుంచీ నిప్పు పెట్టారు. గాలి తాకిడికి క్షణాల మీద కొట్టాలన్నీ ముట్టుకుని భగభగమంటూ




మండసాగినై. బలమైన ఇనపగొలుసులతో కట్టివేయబడిన భయంకర పక్షులు అగ్ని జ్వాలల నుంచి బయటపడేందుకు భీకరంగా అరుస్తూ, ముక్కులతో కాళ్ళ గొలుసులను ఛేదించేందుకు ప్రయత్నించినై. కాని, ఈ లోపలే కొట్టాల కప్పులు కాలి దభీమంటూ లోపలికి కూలటంతో, ఆ మంటల్లో కొన్ని కాలిపోయినై. గొలుసులను ఛేదించుకోగలిగిన కొన్ని భయంకర పక్షులు మండుతూన్న దేహాలతో పైకెగిరి అంతలోనే భూమి మీద పడిపోయి, గిలగిల కొట్టుకుంటూ ప్రాణాలు వదిలినై.

అమరపాలుడూ, అతని అనుచరులూ సంతోషం పట్టలేక కుప్పిగంతులు వేస్తూ పాటలు పాడసాగారు. ఉన్నట్టుండి దాపుల వున్న ఒకానొక కొండప్రాంతాన్నుంచి భేరీ మోతలు వినబడినై. ఆ ధ్వని వింటూనే అమరపాలుడు ఆ దిక్కుకేసి చూస్తూ, "చిత్రసేన మహారాజూ, ఉగ్రాక్షుడూ సైన్యాలతో వస్తున్నారు. ఇక్కడ మనం రేపిన మంటలు వాళ్లకు కనబడి వుంటవి. ఇక మనం కపిలపురాన్ని ఆక్రమించుకోవటమే తరువాయి. మీలో ఒకరిద్దరు సైన్యాలకు ఎదురువెళ్ళి, ఇక్కడ పని సానుకూలం అయినట్టు చెప్పండి," అన్నాడు అనుచరులతో.

అమరపాలుడు ఇలా చెప్పగానే రాక్షసులిద్దరు రాతి గదలను గిర్రుగిర్రున తిప్పుతూ, పొదల మీది నుంచి వేగంగా దూకుతూ భేరీ ధ్వనులు వచ్చిన వైపుకు పరిగెత్తారు.

కొద్దిసేపటి తరవాత చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ సైన్యంతో అక్కడికి వచ్చారు. వాళ్ళకు అమరపాలుడు చేసిన బీభత్సం కంటబడింది. ఇంకా అక్కడా ఇక్కడా మంటలు లేస్తూ, ఆకాశం కేసి పొగలు జిమ్ముతున్న భయంకర పక్షుల కొట్టాలను చూసి ఉగ్రాక్షుడు పట్టలేని ఆనందంతో అమరపాలుణ్ణి సమీపించి, అతణ్ణి చేతులు పట్టుకుని లేవనెత్తి గాలిలో గిర్రున తిప్పుతూ, "ఆహా, వీరుడివంటే నువ్వేయ్



అమరపాలా! నా అడవికి శత్రుభయం లేకుండా చేశావ్. ఏం కావాలో కోరుకో!" అన్నాడు.

"నీ తిప్పడికి గుండెలవిసి చావక ముందే, నన్ను వదిలిపెట్టు, అంతే చాలు!" అన్నాడు అమరపాలుడు ఆయాసపడుతూ.

ఉగ్రాక్షుడు అతణ్ణి తిరిగి భూమి మీద నిలబెట్టి భుజం తడుతూ, "ఒక్క భయంకరపక్షి కూడా పారిపోకుండా, అన్నిటినీ నిప్పుల్లో మాడ్చావుగదా?" అని అడిగాడు.

"అవును, ఒక్కగానొక్కటి కూడా పారిపోలేదు. ఇక మిగిలిందల్లా వాటి రౌతుల్లో కొందరు. ఇక్కడ దాదాపు ఇరవైమంది చచ్చారు. తతిమ్మావాళ్ళు కపిలపురం కోటలో వుంటారని నా అనుమానం," అన్నాడు అమరపాలుడు.

"ఓం, ఇక వాళ్ళెక్కడికి పోతారు? మనం సైన్యాలతో కోటను చుట్టుముట్టి భస్మీపటలం చేసేస్తాం," అంటూ ఉగ్రాక్షుడు జబ్బలు చరిచాడు.

"అలా చేస్తే, రాజకుమార్తె కాంతిమతి కూడా ప్రమాదం కలుగుతుంది. ఆ కోటను పట్టుకునే పని నాకు వదులు, ఉగ్రాక్షా!" అన్నాడు చిత్రసేనుడు.

"అవునవును, ఆ అమ్మాయి మాటే మరిచాను. కోటకు ఎలాంటి హానీ జరక్కూడదు, విన్నారా?" అంటూ ఉగ్రాక్షుడు తన సేవకులకేసి గుడ్లురిమాడు.

"విన్నాం, విన్నాం మహానాయకా!" అంటూ వాళ్ళు కేకలు పెట్టారు.

ఆ తరవాత అమరపాలుడి నాయకత్వం కింద, పదిమంది అశ్వసైనికులు వేగు చూసేందుకు కపిలపురం వైపుకు పంపబడ్డారు. మిగిలిన సైనికులు వంట తయారు చేసే పనిలో నిమగ్నమయారు.

సూర్యుడు పడమటి దిక్కుకు వాలుతున్నాడు. సైనికులు భోజనాలు ముగించి చెట్ల నీడల్లో విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆ సమయంలో వేగు పంపబడిన అశ్వికుల్లో ఒకడు అక్కడికి వచ్చి, "మహా

రాజా! ప్రమాదం. యాభై అరవైమంది పులిరాయుళ్ళు రాజకుమార్తెను మేనాలో ఎక్కించుకుని, కోట వదిలి అడవిలో ఎక్కడికో పోతున్నారు,'' అని చెప్పాడు.

ఈ వార్త వింటూనే చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ కూడా తుళ్ళిపడ్డారు. ఇక్కడ భయంకర పక్షులు మరణించిన సంగతి, కపిలపురం కోటలో వున్న పులిరాయుళ్లకు తెలిసి వుంటుంది. ఇక్కడ లేచిన మంటలూ, పొగా ఆ విషయాన్ని బయట పెట్టి వుంటవి. అందువల్ల ఇక కోట తమ రక్షణకు ఉపయోగించదని తెలుసుకుని, వాళ్ళు రాజకుమార్తెను ఎక్కడో కొండల్లో దాచేందుకు తీసుకుపోతూ వుండి వుంటారు.

చిత్రసేనుడు ఇలా వూహించి, తన సైనికుల్లో రాటుతేలిన యోధులు యాభై మందినీ, ఉగ్రాక్షుణ్ణీ అతడి అనుచరుల్లో కొద్దిమందినీ వెంట పెట్టుకుని, రాజకుమార్తె కోసం అడ్డదారివెంట బయలుదేరాడు. తతిమ్మా సైన్యం అమరపాలుడి నాయకత్వాన కపిలపురం కోట పశపరచుకునేందుకు వెంటనే బయలుదేరవలసిందిగా అజ్ఞాపించాడు.

వేగు వెళ్ళిన అశ్వికుడు దారి చూపగా కొద్దిసేపటికల్లా చిత్రసేనుడు తన అనుచరులతో పులిరాయుళ్ళు వున్న ప్రాంతానికి వచ్చాడు. వేగువాడు చెప్పినట్టుగానే ఒక మేనాను నలుగురు బోయీలు మోస్తున్నారు. దానికి ముందూ వెనకా కత్తులూ, కఠార్లూ ధరించిన పులిరాయుళ్ళు నడుస్తున్నారు.

చిత్రసేనుడు తమను సమీపిస్తూండటం చూస్తూనే, పులిరాయుళ్ళ నాయకుడు కత్తి పైకెత్తి భీకరంగా గర్జిస్తూ, ''మేనా దించండి,'' అని బోయీలను అజ్ఞాపించి. తన అనుచరులతో, ''మన గొంతులో ఊపిరి వుండగా, కాంతిమతి శత్రువుల చేజిక్కరాదు. మనలో ఆఖరివాడు చచ్చే ముందు, ఆమెను చంపి చావాలి, ఇది మహారాజు నాగవర్మగారు ఇచ్చిన అజ్ఞ!'' అన్నాడు.

—(ఇంకావుంది)






# సాహసవీరుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, భీతిగొలిపే ఈ శ్మశానంలో, అర్ధరాత్రివేళ నిన్ను అసాధ్యమైన కార్యాన్ని సాధించేందుకు ప్రేరేపించినవాడు, నీకన్న బలవంతుడూ, తెలివిగలవాడూ అని, నానమ్మకం. లోకంలో కొందరు మనుషులకు, అన్ని విధాలా తమకన్న తక్కువస్థానంలో వున్న వాణ్ణి, ముఖస్తుతితో మైమరపించి, చాటుగా నవ్వుకోవడం ఒక రకమైన తృప్తి. ఇది మనుషులే కాదు; దేవతలూ, రాక్షసులూ కూడే చేసేపని. ఇందుకు ఉదాహరణగా నీకు, ఒక రాక్షసుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



ఒకానొకప్పుడు చతురసేనుడనే మహా రాజు, ప్రపంచంలోని దేశాలన్నిటినీ జయించి, చక్రవర్తి అనిపించుకున్నాడు. తాను జయించిన రాజ్యాలన్నింటిలోనూ, సమర్థులైన పాలకులను నియమించి, ప్రజారంజకుడన్న కీర్తి గడించాడు. ఆయన కారణంగా, ప్రపంచంలో ఎక్కడా యుద్ధభయమన్నది లేకుండా, శాంతి నెలకొన్నది. చతురసేనుడి రాజధాని రంగపట్టణం.

యుద్ధభయం లేకపోవడం వల్ల, దేశంలోని యువకులందరూ, లలితకళలూ, వ్యాపారం లాంటి వృత్తులకేసి, ఆకర్షితులవుతున్నారని, చతురసేనుడికి తెలియవచ్చింది. వాళ్ళు యుద్ధవిద్యలను పూర్తిగా నిరాదరించడం, క్షేమం కాదని ఆయనకు తోచింది. అందువల్ల, ఆయన ఒక సంవత్సరం, రంగపట్టణంలో శస్త్రాస్త్ర విద్యలపోటీ ఏర్పాటు చేశాడు. పోటీలో పాల్గొనడానికి, ప్రపంచం నలుమూలల నుంచీ పలువురు యువకులు వచ్చారు. వాళ్ళకోసం పట్టణపరిసరాల్లో శిబిరాలు నిర్మించబడినై.

పోటీలు ప్రారంభం కావడానికి ఇక రెండు రోజుల వ్యవధి వున్నదనగా, రంగపట్టణంలో, తాడిచెట్టు ప్రమాణం గల రాక్షసుడొకడు ప్రవేశించాడు. వాడు నగర మధ్యంలో నిలబడి, పెద్దగా బొబ్బలు పెట్టి, రాజును పిలిచాడు. మహాసాహసి అయిన చతురసేనుడు కూడా, ఆ భీకరాకారుణ్ణి చూసి వణికిపోయాడు.

''రాజా, నేను తలచుకుంటే, నా కాలి తాకిడికే, ఈ పట్టణం క్షణాల్లో నేలమట్టమై పోతుంది. కాని, నేనలా చేయదలచుకోలేదు. రోజూ, ఇదేసమయానికి వస్తాను. బలిష్ఠులూ, ఆరోగ్యవంతులూ అయిన, ఇద్దరు మనుషుల్ని, నా కప్పజెప్పు. వాళ్ళతో, నా ఆకలి తీర్చుకుని తృప్తిపడతాను,'' అన్నాడు రాక్షసుడు.

వేరేదారిలేక, చతురసేనుడందుకు వెంటనే అంగీకరించాడు. ఆ రోజుకు

రాక్షసుడు, ఇద్దరు మహాకాయుల్ని తీసుకుని, పట్టణంలోంచి వెళ్ళిపోయాడు.

రాక్షసుడు వెళ్లిపోగానే, చతురసేనుడు తన మంత్రులకు కబురు పంపాడు. అందరూ కలిసి ఏమి చేయడం బావుంటుందని చర్చించారు. చివరకు ఒక నిర్ణయానికొచ్చి, దాని ప్రకారం దేశమంతటా చాటింపు వేయించారు. అదేమంటే—లోగడ అనుకున్న ప్రకారం శస్త్రాస్త్రవిద్యల్లో పోటీలంటూ వుండవు. రాక్షసుణ్ణి చంపిన వీరుడికి, చక్రవర్తి ఘనసన్మానం చేస్తాడు.

ఈ చాటింపు విని, శిబిరాల్లోని కొందరు యువకులు చతురసేనుణ్ణి కలుసుకుని, "ఈ రాక్షసుడిశక్తి అపారం. మర్రిచెట్లను వేళ్ళతో సహా పీకిపారవేయగలడు. నదీజలాలను ఔపోసనపట్టగలడు. వాడిమీదికి, కొందరు వీరయువకులను పంపి రెచ్చగొట్టడం ఏమాత్రం క్షేమం కాదు," అని చెప్పారు.

ఈ రాక్షసుణ్ణి గురించి చాలామంది యువకులకు తెలుసు. వాడు ప్రపంచంలోని దేశదేశాలన్నీ తిరుగుతూ, చివరకు ఈ రంగపట్టణం చేరుకున్నాడు.

"చూస్తూ, చూస్తూ రాక్షసుడికోసం నా ప్రజలప్రాణాల నెలా బలిపెట్టగలను?" అన్నాడు చతురసేనుడు.



"ప్రభూ, ఈ రాక్షసుడు నిత్యసంచారి. వీడిక్కడ ఎంతో కాలం వుండడు. అందువల్ల వీడి ఇబ్బంది, మీకు తాత్కాలికం మాత్రమే. లక్షలాది ప్రజల ప్రాణాలను రక్షించడం కోసం, పట్టణంలోని కట్టడాలను కాపాడుకునేందుకూ, తాత్కాలికంగా, కొన్ని వందలమంది ప్రజలు ప్రాణాలు కోల్పోయినా, అంతనష్టం లేదు. ఇంతకుముందు మా దేశాలలోని, తమ ప్రతినిధులు ఇలాగే చేశారు," అన్నారు యువకులు.

చతురసేనుడు ఖిన్నవదనుడై, యువకులను పంపివేసి, తాను తీవ్రాలోచనలో పడ్డాడు.



లాంటిది. ఇది ఎరిగిన మంత్రులు, బాగా ఆలోచించి, మహామంత్రవేత్త అయిన సాంబకుడిని పిలిపించారు.

సాంబకుడు అంజనం వేసి, "రాక్షసుడి శక్తిని, నేను అంచనా వేయలేకపోతున్నాను. నేనిక్కడే వుండి, నా మంత్ర శక్తితో, వాడితో పోరాడతాను. అదృష్టం బావుంటే, వాడంతమవుతాడు; లేదూ నా ప్రాణాలు పోతాయి," అని మంత్రులకు చెప్పాడు.

ఆ రాత్రే సాంబకుడు, రాక్షసుడిపై తన మంత్రశక్తిని ప్రయోగించదలచి, పూజా మందిరాన్ని అప్పటికప్పుడే శుభ్రం చేశాడు. తర్వాత ముగ్గుతో పెద్ద పద్మం వేసి, అందులో శక్తి విగ్రహాన్ని ప్రతిష్ఠచేసి, దానిముందు పద్మాసనం వేసుకుకూర్చుని, కళ్ళు మూసుకుని దీక్షతో మంత్రోచ్చారణ ప్రారంభించాడు.

అయితే, కొద్దిసేపటికే సాంబకుడు రక్తం కక్కుకుని మరణించాడన్న వార్త, మంత్రులకు చేరింది.

మర్నాడు రాక్షసుడు వచ్చి, యథాప్రకారం మరొక ఇద్దరు బలశాలులను తీసుకుని వెళ్ళిపోయాడు. చతురసేనుడికి మతిపోయినట్టయింది.

మంత్రులందరూ మళ్ళీ చర్చలు జరిపారు. ఈసారి వాళ్ళు, అపరధన్వంతరి

రాక్షసుడు మర్నాడు మామూలుగా వచ్చి, ఇద్దరు బలశాలులను తీసుకుని వెళ్ళిపోయాడు.

తన అసహాయతకు చతురసేనుడికి కలిగిన దుఃఖం అంతా, ఇంతా కాదు. ఆయన మరొకసారి మంత్రులందరినీ సమావేశపరిచి, "నా ప్రజలను రోజు తప్పకుండా రాక్షసుడికి విధంగా చేజేతులా సమర్పించుకోలేను. మీరేదైనా దీనికి ఒక పరిష్కారమార్గం చూపండి. లేదా, నేను స్వయంగా వాడితో పోరాడదలిచాను," అన్నాడు.

చతురసేనుడు, రాక్షసుడితో పోరాడడమంటే—ఆత్మహత్య చేసుకోవడం

అని పేరు గాంచిన రాజవైద్యుడిని పిలిపించి, ''మీకు ప్రాణాలు నిలబెట్టగల మందులే కాక, ప్రాణాలు తీయగల విషాల గురించీ తెలిసివుండాలి! విష ప్రయోగంతో, రాక్షసుడి ప్రాణం తీయడం సాధ్యపడదా ?'' అని అడిగారు.

''ఎంత బలశాలినైనా క్షణాల మీద యమలోకం పంపగల, కాలకూటవిషం గురించి, నాకు తెలుసు,'' అన్నాడు రాజ వైద్యుడు.

''ఆ విషానికి రాక్షసుడు మరణిస్తాడా?'' అని అడిగారు మంత్రులు.

రాజవైద్యుడు నవ్వి, ''ఆ విషానికి మరణించనివాణ్ణి, మరే విషమూ చంపలేదు,'' అన్నాడు.

ఆ రాత్రికి రాత్రే రాజవైద్యుడు కాలకూటవిషం తయారుచేసి మంత్రులకు ఇచ్చాడు. వాళ్ళు దాన్ని, మర్నాడు రాక్షసుడికి ఆహారం కావలసిన బలశాలులకు ఇచ్చి, ''దీన్ని మీరు గుప్పెట వుంచుకోండి. మీతోబాటు రాక్షసుడి శరీరంలోకి, ఈ విషం ప్రవేశించాలి. మీరు మరణించినా, రాక్షసుడి ప్రాణాలు తీసిన ఘనత, మీకు దక్కుతుంది. సూర్యచంద్రు లున్నంతవరకూ, ప్రజలు మిమ్మల్ని గుర్తుంచుకుంటారు,'' అని చెప్పారు.

మామూలు ప్రకారం, మరసటిరోజు రాక్షసుడు వచ్చి, బలశాలు రిద్దర్నీ వెంటబెట్టుకుపోయాడు. వాళ్ళతోపాటు, వాడు





విషాన్ని కూడా తిన్నాడు. అయితే, విషం వాడికి ఎలాంటి హానీ కలిగించలేదు. వాడి జీర్ణశక్తి చాలా గొప్పదై వుండాలి. ఆ మర్నాడు కూడా వాడు, మరిద్దరు బలశాలులను తీసుకుపోయాడు.

చతురసేనుడు, తమ మంత్రులనూ, ముఖ్య బంధువులనూ, రాణినీ ఒకచోట సమావేశపరిచి, "ప్రపంచంలోని అన్ని దేశాలనూ జయించి, నేను చక్రవర్తి నయాను. ఇంతకాలం, ఎవరిముందూ తలవంచి ఎరగను. ఇన్నాళ్ళకొక రాక్షసుడు నన్నసహాయుణ్ణి చేసి, నా ప్రజలను చంపి తింటున్నాడు. వాడలా యథేచ్ఛగా సంచరిస్తుండగా, ఈ సింహాసనంపై కూర్చునే అర్హత నాకు లేదు. రేపు వాడి అంతు తేలుస్తాను; లేదా నేనే అంతమై పోతాను," అని చెప్పాడు.

ఇది, కోరి మరణం తెచ్చుకోవడం అని, అందరూ చతురసేనుడికి చెప్పి చూశారు. అయినా, ప్రయోజనం లేక పోయింది.

"రాక్షసుణ్ణి చంపితేనే, నేను చక్రవర్తి ననిపించునేందుకు అర్హుణ్ణి. అలా కాక రాక్షసుడు, నన్ను చంపితే, నా ప్రజల దౌర్భాగ్యాన్ని కళ్ళారా చూసే బాధ, నాకు తప్పుతుంది," అన్నాడు చతురసేనుడు.

రాక్షసుడు మర్నాడు రాగానే, చతురసేనుడు వాడికి ఎదురువెళ్ళి, "ఓరీ, నేనీ భూమండలాన్నంతా జయించి, చక్రవర్తి ననిపించుకున్న చతురసేనుణ్ణి. ఈనాడు నువ్వు, నన్నే శాసిస్తున్నావు. ఇప్పుడు నీతో తలపడదలచుకున్నాను. నేను జయిస్తే, నా ప్రజలకు నీ పీడ విరగడ అవుతుంది. నీవు గెలిస్తే, ఈ రాజ్యం నీకు హక్కుభుక్తమవుతుంది!" అంటూ కత్తి దూశాడు.

రాక్షసుడు, చతురసేనుణ్ణి పిల్లికూనను ఎత్తినట్టు, రెండు వేళ్ళతో ఎత్తి, అరచేతిలో పెట్టుకుని, "నువ్వు, నన్ను గెలవగలననే అనుకుంటున్నావా?" అని పరిహాసంగా అడిగాడు.

"పోరాటం వీర లక్షణం. జయాప జయాలు దైవాధీనాలు," అంటూ చతుర సేనుడు, రాక్షసుడి అరచేతి మీద కత్తితో గట్టిగా పొడిచాడు.

ఆ దెబ్బకు, రాక్షసుడికి ముల్లు గుచ్చు కున్నట్టుగా చిన్నగాటు పడి, రక్తం రాసా గింది. రాక్షసుడు దాన్నేం పట్టించుకో కుండా, రాజు చేతిలోని కత్తిని లాక్కొని, అవతలపారేసి, "చక్రవర్తీ, నీ సాహసానికి మెచ్చాను! ఈ భూమండలంలో, నీవంటి వీరుడు లేడు. నిన్ను చూసినందుకు, నాకెంతో సంతోషంగా వున్నది. ఇక, ఈ దేశాన్ని విడిచి వెళతాను," అన్నాడు.

అందుకు చతురసేనుడు ఆశ్చర్యంగా, "ఎవరు నువ్వు? అసలు మా దేశానికి ఎందుకు వచ్చావు? ఇప్పుడెందుకు హఠాత్తుగా వెళ్ళి పోతానంటున్నావు?" అని అడిగాడు.

దానికి రాక్షసుడు, "నాది పాతాళ లోకం. అక్కడ నేను అన్ని విద్యలలోనూ ఆరితేరాను. మా లోకంలో, నన్నోడించ గలవారే లేకపోయారు. పాతాళ రాజు కూడా, నా పరాక్రమాన్ని మెచ్చుకుని, పాతాళలోకానికి నన్ను సైన్యాధిపతిని చేస్తానన్నాడు. నన్ను మించిన వీరుడితో తలపడేవరకూ, నేనెక్కడా స్థిరంగా వుండలేనని రాజుకు చెప్పుకున్నాను. అప్పు డాయన నాతో, భూలోకసంచారం చేస్తే, నా కోరిక తీరుతుందన్నాడు. నేను భూలో కానికి బయలుదేరి వచ్చాను. ఇక్కడ



ఎన్ని నగరాలు తిరిగినా, నన్నెదిరించే వీరుడే కనిపించలేదు. ఇన్నాళ్ళకు, నన్ను మించిన వీరుడివి నువ్వు కంటబడ్డావు. నా కోరిక తీరింది. నేనిక పాతాళలోకానికి వెళ్ళిపోతాను,'' అని చెప్పి, చకచకా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, కత్తిదూసి తన మీదికి వచ్చిన చతురసేనుణ్ణి, రాక్షసుడు సునాయాసంగా ఎత్తి, తన అరచేతిలో పెట్టుకున్నాడు. చతురసేనుడి కత్తివేటు వాడికి, ముల్లు గుచ్చుకున్నపాటి బాధ కూడా కలిగించలేదు. అలాంటిది, చతురసేనుణ్ణి వాడు, తనను మించిన వీరుడంటూ పొగడడం. ముఖస్తుతితోపాటు, అవహేళన కూడా కాదా? ఇందుకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాక్షసుడికి, పాతాళరాజు సైన్యాధిపతి పదవి ఇస్తానన్నాడు. దీనినిబట్టి తెలుస్తున్నదేమంటే—రాజు, రాక్షసుడికన్న బలవంతుడూ, వీరుడూ అని. అలా కానప్పుడు, వాడు రాజును ఓడించి, తానే పాతాళానికి రాజయేవాడు. అంటే, తనకన్న వీరుడైన వాణ్ణి ఎదిరించే సాహసం, రాక్షసుడికి లేదన్నమాట. ఇక, చతురసేనుడు అలా కాదు. రాక్షసుడు అన్ని విధాలా తనకన్న బలవంతుడని తెలిసీ, అతడిని ఎదిరించాడు. అది నిజమైన వీరుడి లక్షణం! శక్తికి తగినట్లు పోరాడగలవాడు, సామాన్య వీరుడు. శక్తికి మించి పోరాడేవాడు సాహస వీరుడు. ఇది గ్రహించిన రాక్షసుడు, సాహసంలో తను, చతురసేనుణ్ణి మించలేనని తెలుసుకున్నాడు. అందువల్లనే, వాడు చతురసేనుణ్ణి అభినందించి, పాతాళానికి వెళ్ళిపోయాడు. వాడి మాటల్లో ముఖస్తుతిగానీ, అవహేళనగానీ ఏమాత్రం లేదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






మన దేవాలయాలు :

# చాముండేశ్వరి

పూర్వం ఒకానొకప్పుడు అతి భయంకరుడయిన మహిషాసురుడనే రాక్షసుడు విజృంభించి క్రమక్రమంగా ముల్లోకాలను జయించసాగాడు.

దేవతలు అతనితో ఎన్నోసార్లు యుద్ధం చేశారు. కాని, అన్ని యుద్ధాలలోనూ మహిషాసురుడే జయించాడు. అతడి దారుణ కృత్యాలకు భూలోకం గడగడలాడసాగింది. వాడు మరింత రెచ్చిపోయి మంచివారిని పీడించసాగాడు.





ఆ రాక్షసుడి పీడ విరగడ చేయమని దేవతలు, విష్ణువును ప్రార్థించారు. విష్ణువు వారిని ఒక,యజ్ఞం చేయమని ఆదేశించాడు. దేవతలు యజ్ఞం చేసి, యజ్ఞకుండం చుట్టూ కూర్చుని ప్రార్థనలు జరిపారు. వారి ప్రార్థనలు ఫలించి, యజ్ఞకుండంలో దుర్గాదేవి ప్రత్యక్షమయింది.



దుర్గాదేవికి శివుడు తన శూలాన్ని ప్రసాదించాడు. ఇంద్రుడు వజ్రాయుధం ఇచ్చాడు. అదే విధంగా పలువురు దేవతల నుంచి దుర్గాదేవి పలువిధాలైన ఆయుధాలనూ, శక్తులనూ గ్రహించి, అద్భుతమైన సింహాన్ని అధిరోహించి వింధ్యపర్వతాలకేసి ప్రయాణమయింది.

దుర్గాదేవి గంభీర సౌందర్యం గురించి విన్న మహిషాసురుడు, ఆమెను దూరం నుంచి చూసి, ఆ దివ్యసౌందర్యానికి ముగ్ధుడై, తనను పెళ్ళాడమని ఆమెకు కబురు పంపాడు. అందుకు ఆమె నిరాకరించేసరికి ఆగ్రహం చెందాడు.





మహిషాసురుడి అనుచరులు దుర్గాదేవిని వెంటాడి ఆమెను పట్టుకోజూశారు. కాని, ఆమెచేత హతులయ్యారు. అఖరికి మహిషాసురుడు ఆమెను ఎదుర్కొన్నాడు. దుర్గాదేవి, లోకకంటకుడయిన మహిషాసురుణ్ణి సంహరించి లోకకల్యాణం కలిగించింది.

మహిషాసుర సంహార అనంతరం దుర్గా దేవి, ఒక అందమైన కొండ మీద కొంత సేపు విశ్రాంతి తీసుకున్నది. తరవాతి కాలంలో ఆ కొండ పవిత్రమైనదిగా ప్రసిద్ధి గాంచింది.






మైసూరు నగరానికి పదమూడు కిలో మీటర్ల దూరంలో చాముండి పర్వత మని పేరుగాంచిన ఈ కొండ మీదే లోకమాత అయిన దుర్గాదేవి చాముండేశ్వరి ఆలయం వెలుగొందుతున్నది.

సముద్రమట్టానికి 3,489 అడుగుల ఎత్తున వెలిగే ఈ దివ్యక్షేత్రాన్ని చేరుకోవాలంటే, వేయిమెట్లు ఎక్కి నడవాలి. చాముండి పర్వతం మీదే మహాబలేశ్వర మనే శివాలయం కూడా ఉన్నది.





కొండశిఖరానికి వెళ్లేదారిలో బ్రహ్మాండమైన నంది విగ్రహం ఉన్నది. ఒకే శిల నుంచి మలచబడిన ఈ నంది విగ్రహం మెడచుట్టూ చెక్కబడిన గంటలు, లోహంతో చేయబడినవి లాగా చూపరులకు ఆశ్చర్యం కలిగిస్తాయి.

ఆలయంలోని దేవీవిగ్రహం, స్వర్ణమయ సింహాసనారూఢయై దివ్యాకర్షణతో వెలుగొందుతున్నది. ఆలయ పరిసర ప్రాంతాలు సుందర ప్రకృతి దృశ్యాలతో కనులవిందు చేస్తాయి.





ఈ కొండ శిఖరాన్ని చేరుకోడానికి నదుపాయాలు లేని పూర్వకాలంలో కూడా భక్తులు తండోపతండాలుగా వెళ్ళేవారు. ఈనాడు రాకపోకలు సులభం అయ్యాయి. ఇక్కడ యేటా జరిగే దేవీ నవరాత్రీ ఉత్సవాలకు దేశం నలుమూలలనుంచీ భక్తులు అసంఖ్యాకంగా వస్తూ ఉంటారు.



# పంచవ్యాఘ్రశూరుడు

కొన్ని వందల ఏళ్ళ క్రితం చీనాదేశంలో ఒక నిరుపేద యువకు డుండేవాడు. అతను కట్టెలు కొట్టి జీవించేవాడు. అతని కొక తల్లి మాత్రం ఉండేది.

ఒక శీతాకాలపు సాయంత్రం వేళ కొండచరియలో అతను కట్టెలు కొట్టు తూండగా సమీపంలో ఉండిన వెదురు పొద నుంచి బాధను సూచించే మూలుగు లాటిది వినిపించింది. వెదురుపొద దట్టంగా ఉండటంచేత లోపల ఎవరున్నదీ కానరాలేదు.

అతను గొడ్డలి భుజాన పెట్టుకుని వెదురుపొదను సమీపించాడు. మూలుగు మరింత గట్టిగా వినిపించిందే గాని, లోపల ఉన్నది కనిపించలేదు. అందుచేత అతను అతిజాగ్రత్తగా పొదలోకి ప్రవేశించాడు. జాగ్రత్త దేనికంటే, అది అయిదేళ్ళ క్రితం నరికిన వెదుళ్ళపొద. వెదురు మొదళ్ళు కత్తికన్న ఎంతో పదునుగా ఉంటాయి. పొరపాటున ఎవరైనా వాటి పైన పాదం మోపితే ఆ క్షణమే పాదాన్ని చీల్చేస్తాయి.

కట్టెలు కొట్టేవాడికి పొద లోపల ఒక ఆడపులి కనబడింది. దాని పాదంలోకి వెదురుపేడు లోతుగా దిగబడి పోయింది. ఆ కారణంగా అది కదలలేని స్థితిలో ఉండి, బాధతో మూలుగుతున్నది. మొదట పులిని చూసి భయం కలిగినా, దీనంగా తన కేసి పులి చూసిన చూపులకు కట్టెలు కొట్టేవాడి గుండె ద్రవించి పోయింది.

అతను పొద నుండి బయటికి వచ్చి, కొండ దిగి, ఇంటికి పరిగెత్తి, "అమ్మా, కొండ మీద ఒక పులి, పాపం, గాయపడి చాలా బాధలో ఉన్నది. దాన్ని కాపాడుదాం, నా వెంట సాయం వస్తావా ?" అన్నాడు.

చీనా జానపదకథ



"అలాగా, నాయనా? ఒక్క క్షణం ఉండు. గాయాలకు రాయటానికి మందు తెస్తాను," అన్నది తల్లి.

ఇద్దరూ పులి ఉన్న చోటికి వచ్చారు. తల్లి, పులికి ఊరడింపుగా మాట్లాడుతూ ఉంటే, కొడుకు ఉపాయంగా పులి కాలును వెదురు నుంచి పైకి తీశాడు. విమోచనం కలిగిన అనంతరం పులి తన సహజక్రౌర్యం చూపక, తల్లీ కొడుకుల కేసి చాలా కృతజ్ఞతతో చూసింది. తల్లి పులి కాలిగాయానికి మందు రాచి, చప్పున రెండడుగులు వెనక్కు వేసి, మర్యాదగా సెలవు పుచ్చుకోవటానికి ఏదో అనాలి గనుక, "పులితల్లీ, మేం పేదవాళ్ళం. నా కొడుక్కి ఎవరూ పిల్ల నివ్వకుండా ఉన్నారు. నీ ఎరికన మంచి పిల్ల ఎవత్తె అయినా ఉంటే మావాణ్ణి ఒక ఇంటి వాడుగా చేద్దూ, నీకు పుణ్యం ఉంటుంది!" అని కొడుకుతో సహా గబగబా ఇంటికి వచ్చేసింది.

ఇంకా శీతాకాలం ముగియకమునుపే, ఒక ధనికుడి కుమార్తెను పెళ్ళికూతుర్ని చేసి, సారెతో సహా ఆ కొండప్రాంతాన, కాబోయే అత్తవారింటికి తీసుకుపోతూం డటం తటస్థించింది. పెళ్ళి కూతురు మేనాలో ఉన్నది. ముందూ వెనకా మనుషులు పెట్టెలూ, కావళ్ళూ మోస్తూ వస్తున్నారు.

అకస్మాత్తుగా ఈ పెళ్ళివారు వచ్చే దారికి అడ్డంగా అయిదు పెద్దపులులు కూర్చుని, కోరలు తెరిచి గుర్రుమంటూ, తోకలు ఆడిస్తూ ప్రత్యక్షమయాయి. కావళ్ళూ, పెట్టెలూ, మేనా అక్కడే పారేసి, వాటిని మోసేవాళ్ళంతా కాలి సత్తువకొద్దీ పరిగెత్తి, కొండల్లోకి మాయ మయారు. పెళ్లికూతురు మాత్రం కంగారు పడి మేనా తలుపులు తెరుచుకుని బయ టికి వచ్చి, తానూ అయిదు పులులూ తప్ప ఎవరూ లేకపోవటం చూసింది.

ఆ తరవాత ఒక గంటకు కాబోలు, కట్టెలు కొట్టేవాడి ఇంటి తలుపు ఎవరో

తట్టారు. ఆ యువకుడు వెళ్ళి తలుపు తీసేసరికి, అందమైన పెళ్ళికూతురు బయట నిలబడి ఉన్నది. ఆమె వెనకగా అయిదు పులులున్నాయి. అవి మంద హాసం చేస్తున్నట్టుగా కట్టెలు కొట్టేవాడికి అనిపించింది.

త్వరలోనే కట్టెలు కొట్టేవాడు ఆమెను పెళ్ళాడాడు. ఆమె తన భర్తపట్లా, అత్త గారిపట్లా ఎంతో ప్రేమాభిమానాలతో మసులుకున్నది. వాళ్ళకు జీవితం సుఖంగా వెళ్ళిపోతున్నది.

కాని పెళ్ళికూతురు తండ్రికి జరిగిన సంగతి తెలియవచ్చింది. ఆయన ఉండేది కొండ అవతలిపక్క. ఆయన చాలా గొప్ప ధనికుడు, పలుకుబడి కలవాడు కూడా. ఆయన ఆగ్రహించి, కట్టెలు కొట్టేవాడూ, అతని తల్లీ కలిసి తన కుమార్తెను అపహరించారని న్యాయాధికారి వద్ద ఫిర్యాదు చేశాడు. న్యాయాధికారి కట్టెలు కొట్టేవాణ్ణీ అతని తల్లినీ న్యాయస్థానానికి రప్పించాడు.

తాను పెళ్ళాడిన పిల్లను తాను దొంగిలించలేదనీ, పులులు తెచ్చి తన ఇంట దిగబెట్టాయనీ చెప్పాడు, వాడు. న్యాయాధికారి ఈ మాట నమ్మక, "వీడు తప్పు ఒప్పుకునేదాకా కర్రలతో కొట్టండి. నిజం చెప్పని పక్షంలో చచ్చేదాకా కొట్టండి," అని తన భటులను ఆజ్ఞాపించాడు.

అప్పుడు కట్టెలు కొట్టేవాడి తల్లి న్యాయాధికారి కాళ్ళపై పడి, "మావాడు నిజమే చెబుతున్నాడు. కావలిస్తే నేను



వెళ్ళి పులులను సాక్ష్యం తెస్తాను,'' అన్నది.

ఇదంతా న్యాయాధికారికి ఏదో వినోదంగా తోచి, ''సరే, సాక్షులను తీసుకురా. అంత దాకా శిక్ష నిలుపు చేస్తాను,'' అన్నాడు.

ఆమె వెళ్ళి కొద్దిసేపటిలోనే తిరిగి వచ్చింది. ఆమె వెనకగా వస్తున్న అయిదు పెద్దపులులనూ చూసి, న్యాయస్థానంలో వాళ్ళంతా పారిపోయారు. న్యాయాధిపతి మాత్రం ఎత్తయిన బల్ల ఎక్కి, వణుకుతూ నిలబడి పులులను చూసి, ''మీరేనా—?'' అన్నాడు. ఆపైన అయనకు మాట పెగలలేదు.

న్యాయాధికారి అడగ దలచిన ప్రశ్న అర్థమైనట్టుగా పులులు తమ తలలను పైకీ, కిందికీ ఆడించాయి. విచారణ అయిపోయింది. కట్టెలు కొట్టేవాడు, తన తల్లితో సహా ఇంటికి తిరిగి వచ్చేశాడు.

ఆ యేడే వేసవిలో అనేక వేల సంఖ్యలో ఆటవికులు రాజ్యం మీదికి దండెత్తి వచ్చారు. వాళ్ళ వెంట వేట కుక్కలూ, భల్లూకాలూ, వానరాలూ ఉన్నాయి. చక్రవర్తి సైన్యాలు యుద్ధానికి తరలి వెళ్ళాయిగాని, యుద్ధవిద్యలేవీ ఆ ఆటవిక మూకల మీద పనికిరాలేదు. చక్రవర్తికి ఘోర పరాజయం కలిగేలా కనబడింది. చక్రవర్తికి మతిపోయింది. ఆ సమయంలో ఆయనతో ఎవరో కట్టెలు కొట్టేవాడి పులులను గురించి చెప్పారు. చక్రవర్తి వెంటనే అతన్ని పిలిపించి, ''నువు శత్రువులను పారదోలితే, నా సేనకు నిన్ను సర్వసేనాని చేస్తాను,'' అన్నాడు.

యోధులనూ, భేరీలనూ, కవచాలనూ చూసి బెదరని ఆటవిక సేన అయిదు పెద్ద పులులను చూడగానే హడలి పారిపోయింది. చక్రవర్తి పరువు దక్కింది. ఆయన కట్టెలు కొట్టేవాణ్ణి శాస్త్రోక్తంగా సర్వసేనానిగా అభిషేకించి, ''పంచవ్యాఘ్రశూర'' అని బిరుదిచ్చి, పెద్ద జీతం మీద తన వద్ద కొలువు ఉంచుకున్నాడు.






ఈసారి కుబేరుడు ఇద్దరు మంత్రులను, శుక్రుడూ, ప్రోష్టపదుడూ అనే వాళ్ళను వెంట బెట్టుకుని రావణుడి వద్దకు వచ్చి, "ఓరీ, దుర్మార్గుడా, నే నెంత చెప్పినా నీ చెవి కెక్కలేదు. అజ్ఞానం చేత విషం తాగిన వాడికి దాని ఫలితం పొందేటప్పుడు గాని జ్ఞానం రాదు. నీ అజ్ఞానం నీవు గ్రహించటం లేదు. నరకం అనుభవించేటప్పుడు తెలుసుకుంటావు. నీతో మాట్లాడటం వృథా," అన్నాడు.

తరవాత అన్నదమ్ము లిద్దరికీ ద్వంద్వ యుద్ధం జరిగింది. కుబేరుడు తన పైన ప్రయోగించిన అస్త్రాలన్నిటికీ విరుగుడు చేసి, రావణుడు మాయా యుద్ధం సాగించాడు. కుబేరుడికి అనేకరకాల రూపాలు కానవచ్చాయి గాని, ఎక్కడా రావణుడి రూపం కనబడలేదు. ఆ స్థితిలో రావణుడు గదతో కుబేరుడి తలపైన బలంగా కొట్టి, కింద పడగొట్టాడు. రక్తం కారుతూ పడి ఉన్న కుబేరుణ్ణి నిధుల అధిదేవతలు నందన వనానికి చేర్చి, చికిత్సలు చేశారు.

ఈ విధంగా రావణుడు కుబేరుడిపై విజయం సాధించి, పుష్పక విమానాన్ని తీసుకుని, దానిలో ఎక్కి శరవణానికి వెళ్ళాడు. ఆ కొండ బంగారం రంగులో వెలిగిపోతూ, రెండో సూర్యుడిలాగా ఉన్నది. దానిపైకి వచ్చేసరికి పుష్పకం గమనం మాని ఆకాశంలో అలాగే నిలిచిపోయింది.

## 4. వేదవతి ప్రతిజ్ఞ



అది చూసి రావణుడు, "కోరిన ప్రకారం నడిచే ఈ విమానం ఎందుకిలా ఆగిపోయి ఉంటుంది?" అని వెంట ఉన్న తన మంత్రులను అడిగాడు.

ఇంతలోనే, ఈశ్వరుడి పార్శ్వచరుడూ, మహాబలుడూ అయిన నంది రావణుడితో, "దశగ్రీవా, వెంటనే వెనక్కు వెళ్ళిపో. ఈ పర్వతం మీద శివుడు క్రీడిస్తున్నాడు. సుపర్ణులూ, నాగులూ, యక్షులూ, దైత్యులూ, దానవులూ, రాక్షసులూ, నీ ఇతర ప్రాణులూ ఈ పర్వతం మీదికి రారాదు," అన్నాడు.

ఈ మాటలు వినగానే, రావణుడు ఆగ్రహావేశంతో చలించిపోతూ, "శంకరుడెవడు?" అంటూ వేగంగా విమానం దిగి కొండ కిందికి వచ్చాడు. అక్కడ అతనికి శివుడూ, ఆయనకు కొద్ది దూరంలో శూలం పట్టుకుని, సాక్షాత్తు రెండవ శివుడిలాగా నిలబడి ఉన్న నందీశ్వరుడూ కనిపించారు. నందీశ్వరుడి వానర ముఖం చూసి రావణుడు మేఘం గర్జించినట్టుగా పగలబడి నవ్వాడు.

అపరశంకరుడైన నంది, రావణుడి నవ్వుకు కోపించి, "నా కోతి ముఖం చూసి నవ్వావు గనక, నా రూపమే కలిగి, నాతో సమానమైన శక్తిగల వానరులు నిన్నూ, నీ కులాన్నీ తప్పక నిర్మూలిస్తారు," అని శపించాడు.

రావణుడు నిర్లక్ష్యంగా పర్వతాన్ని సమీపించి నందితో, "నా విమానాన్ని ఆపిన ఈ పర్వతాన్నే ఇప్పుడు పెల్లగించేస్తాను. నేను భయంకరుణ్ణని తెలియదులాగుంది," అంటూ తన చేతులను పర్వతం కిందికి దూర్చి ఆ పర్వతాన్ని ఎత్తసాగాడు. పర్వతం సంచలించి పైకి లేచింది.

శివుడిదంతా చూసి చిరునవ్వు నవ్వి, తన కాలి బొటన వేలితో పర్వతాన్ని కొద్దిగా నొక్కాడు. దానితో రావణుడి చేతులు కొండ కింద చిక్కుకుని నలిగాయి. ఆ బాధకు రావణుడు మహా

దారుణంగా ఆక్రోశించాడు. రావణుడి మంత్రులు నిర్ఘాంతపోయారు. వాళ్ళు రావణుడితో, "రాజా, శంకరుణ్ణి తృప్తి చెయ్యి. ఆయన తప్ప మరే దిక్కూ కన బడదు. ఆయనను స్తోత్రం చెయ్యి." అని సలహా ఇచ్చారు. రావణుడు బాధతో ఏడుస్తూనే శివుణ్ణి స్తోత్రం చేశాడు.

చివరకు శివుడనుగ్రహించి, రావణుడి చేతులను కొండ కింది నుంచి తీసుకో నిచ్చి, "నీ వీరత్వమూ, మదమూ, స్తోత్రమూ చూసి సంతోషించాను. నీ చేతులు నలిగినప్పుడు నీవు చేసిన దారుణ మైన ధ్వనినిబట్టి ఇక ముందు నీకు రావ ణుడనే పేరు సార్థకంగా ఉంటుంది. ఇక నీవు నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళు," అన్నాడు.

అప్పుడు రావణుడు, "మహాదేవా, నీకు నాపై తృప్తి కలిగిన పక్షంలో నేను కోరేది అనుగ్రహించు. నే నిదివరకే దేవతలు మొదలైనవారి చేత చావు లేకుండా వరం పొంది ఉన్నాను. అల్పు లైన మానవులను నే నసలు లక్ష్యపెట్టను. బ్రహ్మదేవుడు నాకు దీర్ఘాయువు కూడా ఇచ్చాడు. నేను నీ నుంచి మిగిలిన నా ఆయువునూ, ఒక ఆయుధాన్నీ వేడు తున్నాను. దయచేసి వాటిని అనుగ్ర హించు," అన్నాడు.



శివుడు రావణుడికి, ఆయుశ్శేషాన్నీ, చంద్రహాస మనే ఖడ్గాన్నీ ఇస్తూ, "ఈ ఖడ్గాన్ని ఎన్నడూ అవమానించకు. ఏనాడు దీనికి అవమానం జరిగితే అది అప్పుడే నిశ్చయంగా నా దగ్గిరికి తిరిగి వస్తుంది," అన్నాడు.

ఈ విధంగా శివుడిచేత వరాలు పొంది, రావణుడు తన పుష్పకం ఎక్కి భూమి అంతటా సంచరిస్తూ, వీరులైన రాజు లందరినీ క్షోభ పెట్టాడు. పరాక్రమ సంప న్నులు అతనితో యుద్ధాలు చేసి నశిం చారు. తెలివి గలవాళ్ళు అతన్ని గెలవ లేమని తెలుసుకుని, ఓటమి ఒప్పుకుని, అతనికి లొంగిపోయారు.



అలా లోక సంచారం చేస్తూ రావణు డొకసారి హిమాలయానికి వెళ్ళి, అక్కడ ఒక దేవస్త్రీ లాటి రూపవతిని చూశాడు. ఆమె ఋషులలాగా కృష్ణాజినమూ, జటా వల్కలాలూ ధరించి తపోదీక్షలో ఉన్నది. రావణు డామె సౌందర్యానికి సమ్మోహితుడై, సరదాకు అడుగుతున్న వాడి లాగా, "సుందరీ, ఈ యౌవనంలో తపస్సు పెట్టుకున్నా వేమిటి? నీ అందం చూసి పురుషులు సమ్మోహితులవుతారు గదా! ఎందుకీ కఠిన వ్రతం?" అని అడిగాడు.

ఆమె రావణుడికి తన వృత్తాంతం ఈ విధంగా చెప్పింది:

"బృహస్పతి కొడుకైన కుశధ్వజుడు నా తండ్రి. నా పేరు వేదవతి. అనేక మంది దేవతలూ, గంధర్వులూ, యక్షులూ, రాక్షసులూ మా తండ్రి వద్దకు వచ్చి, నన్ను తమ కిచ్చి పెళ్ళి చెయ్యమని కోరారు. కాని మా తండ్రి ఒప్పుకోలేదు. కారణ మేమిటంటే, ఆయనకు విష్ణుమూర్తినే తన అల్లుడుగా చేసుకోవాలనే కోరిక ఉండేది. ఈ సంగతి తెలిసి దంభుడనే రాక్షసుడు, ఒక రాత్రి మా తండ్రి నిద్రపోతూండగా వచ్చి, ఆయనను చంపేశాడు. మా అమ్మ ఆయనతో బాటు సహగమనం చేసింది. నేను మా తండ్రి కోరికను పూర్తిచేసే ఉద్దేశంతో విష్ణువునే నా భర్తగా మనసులో భావించుకుని తపస్సు చేస్తున్నాను. కనక, రావణా, ఇక నీవు వెళ్ళవచ్చు."

ఈ మాటలు విని రావణుడు మోహావేశపరుడై విమానం నుంచి దిగి, "అమ్మాయీ, పొగరెక్కి నీ మనస్సు వికటించింది. లేకపోతే త్రిలోకసుందరివై ఉండి, నీ యౌవన మిలా పాడుచేసుకుంటావా? నేను దశగ్రీవుణ్ణి, లంకాధిపతిని. నా భార్యవై సమస్త భోగాలూ అనుభవించు. విష్ణువు ఎవడు? నాకున్న తపస్సూ, భోగాలూ, బలమూ వాడి కున్నాయా?" అన్నాడు.

"నీ కేమాత్రమైనా బుద్ధి ఉంటే దేవాదిదేవుడయిన మహావిష్ణువును గురించి అలా చులకనగా మాట్లాడవు." అన్నది వేదవతి.

వెంటనే రావణుడు ఆమె జుట్టు పట్టుకున్నాడు. వేదవతి కోపావేశంతో తన చేతులను కత్తులు లాగా చేసి తన జుట్టును కోసేసింది. తన క్రోధాగ్నితో రావణుణ్ణి దహించే దానిలాగా అయిపోయి, వేదవతి అగ్నిని ప్రజ్వలింపజేసి, రావణుడితో, "నీచుడా, నీచేత అవమానించబడి ఇక జీవించను. ఈ అగ్నిలోపడి ప్రాణాలు వదిలి, నిన్ను చంపటానికి అయోనిజనుగానూ, పతివ్రతగానూ పుట్టి తీరుతాను," అంటూ అగ్నిలో దూకేసింది. ఆ వేదవతే తరవాతి కాలంలో సీతగా పుట్టి, జనకుడి ఇంట పెరిగి, రాముడికి భార్య అయి, రాముడి బలంతో రావణుడి చావుకు కారకురాలయింది.

వేదవతి అగ్నికి ఆహుతి అయిపోయాక రావణుడు తిరిగి పుష్పకం మీద లోక పర్యటన చేస్తూ, మరుత్త మహారాజు దేవతలను దగ్గిర పెట్టుకుని, యజ్ఞం చేస్తున్న చోటికి వచ్చాడు. బృహస్పతి తమ్ముడైన సంవర్తుడు యజ్ఞం చేయిస్తున్నాడు. రావణుణ్ణి చూస్తూనే అక్కడ చేరిన దిక్పాలకులు భయభ్రాంతులై



మారు రూపాలు ధరించారు. ఇంద్రుడు నెమలి అయాడు, యముడు కాకిగా మారాడు, కుబేరుడు తొండ రూపాన్నీ, వరుణుడు హంస రూపాన్నీ ధరించారు. మిగిలిన దేవతలు తలా ఒక జంతువు రూపమూ పొందారు.

ఇంతలో రావణుడు నిస్సంకోచంగా యజ్ఞవాటికలో జొరబడి, మరుత్తును చూసి, "యుద్ధం చేస్తావా? ఓడానని ఒప్పుకుంటావా?" అని అడిగాడు.

"నువ్వెవరు?" అని మరుత్తుడు రావణుణ్ణి అడిగాడు.

రావణుడు పెద్దగా నవ్వి, "భేష్, రావణుణ్ణి కూడా నీ వెరగవు! నా బలపరా



క్రమాలను గురించి ఎరగనివాడు మూడు లోకాలలోనూ మరొకడు ఉంటాడను కోను. నా అన్నను జయించి నేనీ విమానం కాజేశాను,'' అన్నాడు.

ఆ మాట విని మరుత్తు మండిపడుతూ, ''తండ్రిలాటి అన్ననే జయించిన నీవెంత ఘనుడవు! అటువంటి దుర్మార్గం చేసి నందుకు గర్వపడుతున్నావా? కొంచెం ఆగు, నా బాణాలతో నీ ప్రాణాలు తీస్తాను,'' అని లేచి వెళ్ళి ధనుర్బాణాలు తీసుకున్నాడు.

అప్పుడు మరుత్తమహారాజుకు సంవర్తుడడ్డుపడి. ''రాజా, తొందరపడక నేను చెప్పేది విను. ఈ మహేశ్వర యజ్ఞం మధ్యలో విఘ్నం అయితే వంశనాశనం జరుగుతుంది. యజ్ఞదీక్షలో ఉన్న నీవు ఆగ్రహించట మేమిటి? యుద్ధం చెయ్యట మేమిటి? అది అలా ఉంచి, యుద్ధంలో ఈ రాక్షసుణ్ణి ఎలా జయిస్తావు? వాడు దుర్జయుడు!'' అన్నాడు.

గురువు చెప్పిన మాట విని, మరుత్తు ధనుర్బాణాలు వదిలేసి తిరిగి యజ్ఞదీక్షలో కూర్చున్నాడు. అది చూసి రావణుడి మంత్రి అయిన శుకుడు పట్టరాని సంతోషంతో, ''రావణుడిదే గెలుపు!'' అని పెద్దపెట్టున కేకలు పెట్టాడు. రావణుడు యజ్ఞవాటికలో ఉండే ఋషులను తిని తృప్తి చెంది, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

తరవాత దిక్పాలకులు తమ నిజ రూపాలు ధరించి, తాము ఏ యే ప్రాణుల రూపాలు ధరించారో వాటికి వేరు వేరుగా వరాలిచ్చారు.

అప్పటి దాకా నెమళ్ళు నల్లగా ఉండేవి. ఇంద్రుడు వాటికి అనేక రంగులుండేటట్టూ, తన వెయ్యి కళ్ళూ వాటి పింఛాలలో అలంకారంగా ఉండేటట్టూ, వాటికి ఏమాత్రం పాములభయం లేకుండా ఉండేటట్టూ, ఇంద్రుడు పంపే వర్షం వాటికి ఆహ్లాదం కలిగించేటట్టూ వరమిచ్చాడు.



అలాగే యముడు కాకులకు ఏ రోగమూ లేకుండానూ, వాటికి సహజ మృతి లేకుండానూ, కాకులకడుపు నిండితే తన లోకంలో ఉండే పితృదేవతల కడుపులు నిండేటట్టూ వరమిచ్చాడు.

వరుణుడు హంసలకు నురుగులాటి దేహకాంతీ, జలజీవనమూ, సుఖప్రదమైన జీవితమూ ఇచ్చాడు. కుబేరుడు తొండలకు బంగారు వర్ణం ఇచ్చాడు.

రావణుడు లోకమంతా తిరుగుతూ మరుత్త మహారాజును అడిగినట్టే, గొప్ప గొప్ప రాజు లందరి వద్దకూ వెళ్ళి, "నాతో యుద్ధం చేస్తావా, ఓడినట్టు ఒప్పుకుంటావా ?" అని అడుగుతూ వచ్చాడు. దుష్యంతుడూ, సురధుడూ, గాధీ, గయుడూ, పురూరవుడూ మొదలైన రాజులందరూ రావణుడికి ఓడినట్టు ఒప్పుకున్నారు.

అయోధ్యను పాలిస్తూ ఉండిన అనరణ్య మహారాజు మటుకు రావణుణ్ణి యుద్ధానికి రమ్మన్నాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో అనరణ్యుడి సేనలు కార్చిచ్చులో నల్లులు మాడినట్టు మాడి చనిపోయారు. ద్వంద్వ యుద్ధంలో అనరణ్యుడి బాణాలు రావణుణ్ణి ఏమీ చెయ్యలేకపోయాయి. రావణుడు తన నెత్తిన చేతితో చరిచేసరికి అనరణ్యుడు రథం నుంచి కిందికి పడిపోయి, విలవిల తన్నుకుని ప్రాణాలు విడుస్తూ, తన ఇక్ష్వాకు వంశంలో పుట్టబోయే వాడి చేతిలో రావణుడు చస్తాడని శపించాడు.

రావణు డీవిధంగా గగన విహారం చేస్తూ, మానవజాతిని మహా భయపెడుతూ తిరుగుతుండగా, ఒకనా డతని పుష్పకానికి ఎదురుగా నారదమహాముని మబ్బుల మీదుగా వస్తూ ఎదురయాడు. ఇద్దరూ ఆగి మాట్లాడుకున్నారు.

"నాయనా, రావణా ! నీ బలపరాక్రమాలు చూసి ఎంతో సంతోషించాను. కాని, ఒకటి నాకు నచ్చలేదు. దేవతల వల్ల కూడా చావు లేని వీరాధివీరుడయిన

నీవు అల్పులైన మానవులమీద నీ ప్రతాపం చూపిస్తా వేమిటి? మానవులు అనేక వ్యసనాలతోనూ, రోగాలతోనూ, క్షణంలో వచ్చిపడే వార్ధక్యంతోనూ, రకరకాల కష్టాలతోనూ, నష్టాలతోనూ తీసుకుంటూ ఉంటారు గదా! అలాటి వాళ్ళతో వీరు డెవడైనా యుద్ధానికి తలపడతాడా? వాళ్ళందరినీ యముడు చంపుతూనే ఉన్నాడు. ఆ యముడితో యుద్ధం చెయ్యి, అతణ్ణి చంపు. యముణ్ణి చంపితే నరలోకమంతా జయించినట్టేగద!'' అన్నాడు నారదుడు.

''అయ్యో, నారదా! నేను ముందు పాతాళాన్నీ, తర్వాత స్వర్గాన్నీ జయించి, మూడు లోకాలనూ, స్వాధీన పరచుకుని, తరవాత సముద్రాన్ని మథించి, జరామరణాలు లేకుండా చేసే అమృతం సంపాదించే ఆలోచనలో ఉన్నాను,'' అన్నాడు రావణుడు.

''ఈ పక్కనే ఉన్న యమలోకాన్ని వదిలి ఇంకెక్కడికో పోతానంటా వేమిటి? నీ విప్పుడు వెళ్ళేదారే అది,'' అన్నాడు నారదుడు.

రావణుడు కాలమేఘం మెరిసినట్టుగా నవ్వి, ''చాలా బాగా చెప్పావు, నారదా. మంచి సంతోషకరమైన మాట. నేనిప్పుడే బయలుదేరి యమలోకానికి పోతాను. అసలు దిక్పాలకులను నలుగురినీ జయించాలని అదివరకే ప్రతిజ్ఞ పట్టాను. ఇప్పుడు వెళ్ళి, అన్ని ప్రాణులకూ మరణ భయం కలిగించే ఆ యముడి ప్రాణాలు తీస్తాను,'' అని నారదుడికి నమస్కారం చేసి, ఆయనవద్ద సెలవు పుచ్చుకుని, తన మంత్రులతో సహా దక్షిణ దిక్కుగా బయలుదేరాడు.

అన్ని ప్రాణులనూ చంపే యముడికి చావనేది ఎలా కలుగుతుందో నారదుడికి కొంచెం కూడా అర్థం కాలేదు. ఆ యముణ్ణి రావణుడు ఎలా జయిస్తాడో కళ్ళారా చూడాలని కుతూహలం పుట్టి, నారదుడు కూడా అక్కడినుంచి యమపట్టణానికే బయలుదేరాడు.





# స్వార్థచింతన

మయూరపురం అనే గ్రామంలో, విశ్వనాధుడనే బీదకుర్రవాడుండేవాడు. తల్లి వాణ్ణి ప్రసవిస్తూనే మరణించింది. తండ్రి, వాడికి ఐదేళ్ల ప్రాయంలో, పాముకాటుకు గురై మరణించాడు.

వాడు పట్టి దురదృష్టజాతకుడని భావించి, బంధువులెవరూ వాణ్ణి చేరదీయలేదు. ఊళ్ళోనివాళ్ళు తలా ఒక ముద్దా పెడితే తింటూ, రోజులుగడిపేవాడు. అయినా, విశ్వనాధుడు దొరికింది తిని వూరికనే కూర్చునేవాడు కాదు. చేయగలిగినంతవరకూ వారికీ, వీరికీ పనులు చేసిపెట్టేవాడు.

విశ్వనాధుడి చురుకుదనం, అందరికీ ముచ్చటగొలిపేది. మొదట్లో వాడికి తిండి భిక్షగా పెట్టినవాళ్ళే, తరవాత, వాడు తమకు సాయపడుతున్నందుకు ప్రతిఫలంగా తిండిపెట్టసాగారు.

కొన్నాళ్ళకు వాడు యుక్తవయస్కుడయాడు. మయూరపురంగ్రామపెద్ద ధర్మదాసుకు, విశ్వనాధుడు అనేక సందర్భాలలో ఉపయోగపడ్డాడు. అందువల్ల, వాడంటే ఆయనకు ప్రత్యేకాభిమానం. ఇకపైనవాడు ఎవరి మీదా ఆధారపడకుండా, స్వతంత్రంగా జీవించేలా ఏదైనా ఏర్పాటు చేయాలనుకున్నాడు, ధర్మదాసు.

ఆయన ఒకనాడు విశ్వనాధుణ్ణి పిలిపించి, "నీవూ, నీ మంచితనం, నాకు నచ్చాయి. అందువల్లనే నీకు సాయం చేస్తున్నా. మా పశువుల పాకనుంచి, నీకు నచ్చిన నాలుగు గేదెల్ని తీసుకుపో. వాటి పాలతో వ్యాపారం చేసుకుని, నీ కాళ్ల మీద నువ్వు నిలబడు. సంపాయించిననాడు, నా బాకీ తీర్చవచ్చు." అని చెప్పాడు.

విశ్వనాధుడు, ఆయనకు కృతజ్ఞతలు చెప్పుకుని, మంచి గేదెలు నాలుగింటిని

ఎస్. శివనాగేశ్వరరావు



తోలుకుపోయాడు. తరవాత ఒక మంచి రోజు చూసి పాలవ్యాపారం ప్రారంభించాడు. అతడు చిక్కటి పాలను సరసమైన ధరకు అమ్మేవాడు.

ఆ ఊరిలో కళింగుడనే పాలవ్యాపారి ఒకడున్నాడు. తక్కువపాలలో, ఎక్కువ నీరు కలిపి, ఎక్కువ ధరకు విక్రయించడంలో, వాడు అందెవేసిన చేయి.

వాడు ఒకనాడు విశ్వనాధుడి వద్దకు పోయి, ''మనం చేసేది వ్యాపారం; ధర్మకార్యంకాదు. వ్యాపారానికి లాభం ముఖ్యం. నీవు చిక్కటి పాలను తక్కువ ధరకు అమ్మితే, లాభం మాట దేవుడెరుగు, పూట గడవడం కష్టమవుతుంది. ఇక ధర్మదాసు బాకీ ఎలా తీర్చగలవు? అందువల్ల, పాలల్లో నీళ్ళు కలుపు. కొంచెం ధర కూడా పెంచు,'' అని వ్యాపార పద్ధతి వివరించాడు.

అందుకు విశ్వనాధుడు, ''ఈ ఊరు నాది. ఈ ఊరివారందరూ, నావారు. అటువంటప్పుడు, పాలను కల్తీ చేసి అమ్మడం, నన్ను నేను మోసం చేసుకోవడమే అవుతుంది. నిజాయితీగా వ్యాపారం చేస్తాను. వచ్చినంతే వస్తుంది,'' అన్నాడు.

ఒక రోజున క్షేమేంద్రుడనే అసామీ, తన ఇంటిముందు కూర్చుని విశ్రాంతి తీసుకుంటూండగా, విశ్వనాధుడు అటుగా పోతూ కనిపించాడు. క్షేమేంద్రుడి కూతురు పెళ్ళిసందర్భంలో, విశ్వనాధుడు ఆయనకు విశేషంగా సహాయపడ్డాడు.

క్షేమేంద్రుడు, అతణ్ణి దగ్గిరకుపిలిచి, ''ఏదో వ్యాపారం మొదలు పెట్టావని విన్నాను. ఎలా నడుస్తున్నది?'' అని అడిగాడు.

''ఏం చెప్పను, బాబూ! పాలమీద వచ్చే ఆదాయంకంటే, గేదెల మేతకయ్యే ఖర్చే ఎక్కువగా వున్నది. ఏం చేయాలో పాలుబోవడం లేదు,'' అని జవాబిచ్చాడు విశ్వనాధుడు.

దానికి క్షేమేంద్రుడు, ''పాలవ్యాపారం లాభసాటిగా లేకపోతే, మా ఇంటిముం

దున్న ఖాళీస్థలంలో, పాదులుచేసి కూర గాయలు పండించు,'' అని సలహా ఇచ్చాడు.

విశ్వనాధుడికి ఇది నచ్చింది. అతడు, క్షేమేంద్రుడికి కృతజ్ఞతలు చెప్పుకుని, అప్పుడే ధర్మదాసును చూడబోయి, ''అయ్యా, పాలవ్యాపారం అంత లాభ సాటిగా లేదు. అందుచేత, మీ గేదెల్ని మీకు అప్పగిస్తున్నాను, క్షమించాలి!'' అని క్షమాపణ చెప్పుకున్నాడు.

తర్వాత క్షేమేంద్రుడిచ్చిన ఖాళీ స్థలంలో, విశ్వనాధుడు రకరకాల కూర గాయల పాదులు పెంచి, వాటితో వ్యాపారం మొదలుపెట్టాడు. అతను పుచ్చులన్నీ ఏరి పారవేసి, నాణ్యమైన కూరగాయలను మాత్రమే అమ్మేవాడు—అదీ చవకధరకు.

అది గమనించిన చక్రధరుడనే కూర గాయల వ్యాపారి, విశ్వనాధుడితో, ''నీవు నాణ్యమైన కూరగాయలను మాత్రమే అమ్ముతున్నావు. అందుచేత వాటిని, అందరికంటే హెచ్చుధరకు అమ్ము. కాదనుకుంటే, పుచ్చులు కలిపి అందరూ అమ్మేధరకు అమ్ము. ముందు వ్యాపారికి వుండవలసింది లాభదృష్టి; నిజాయితీ సంగతి ఆ తర్వాత,'' అన్నాడు.

అది విని విశ్వనాధుడు, ''దిక్కులేని నన్ను, ఈ ఊరివారు ప్రేమాభిమానలతో పెంచారేగాని, లాభం ఆశించిపెంచలేదు. అటువంటివారినుంచి, నేనేం లాభం





ఆశించను? నేను నిజాయితీపరుణ్ణి కాబట్టే, ఈ స్థితిలో వున్నాను,'' అన్నాడు.

విశ్వనాధుడి కూరగాయల వ్యాపారం కూడా, అంతంత మాత్రంగానే సాగింది.

అలాంటి సమయంలో, సభాపతి అనే పూలవ్యాపారి విశ్వనాధుణ్ణి పిలిపించి, ''నేను వృద్ధుణ్ణయిపోయాను. ఈ పూల వ్యాపారం, నావల్ల కావడం లేదు. నా కొడుకు లందరూ వేరే వ్యాపారాల్లో స్థిరపడ్డారు. నీకు సమ్మతమైతే, నా పూల వ్యాపారం నువ్వు చేసుకో,'' అన్నాడు.

విశ్వనాధుడు కూరగాయల వ్యాపారానికి స్వస్తిపలికి, పూలవ్యాపారం ప్రారంభించాడు. అతను నలిగినపూలనూ, వాడినపూలనూ అవతలపారేసి, మంచి పూలను ఒత్తుగా మాలలుకట్టి అమ్మసాగాడు.

ఇది గమనించిన సభాపతి, ''నువ్వు చేస్తున్న పద్ధతిలో లాభాలు రావు. మంచి పూలతోపాటుగా నలిగినపూలనూ, వాడినపూలనూ కలిపి మాలలు కట్టాలి. అంతే కాదు, మాలకట్టేటప్పుడు పూలకూ, పూలకు మధ్య చిన్న ఎడం వుంచాలి,'' అని సలహాయిచ్చాడు.

అందుకు విశ్వనాధుడు, ''నేను ఒంటరి వాణ్ణి. ఎలా అయినా బతగ్గలను. అటువంటప్పుడు, మన వూరివాళ్ళను ఎందుకు మోసగించాలి?'' అని సభాపతిని ప్రశ్నించాడు.

విశ్వనాధుడికి పూలవ్యాపారంలో కూడా శ్రమకుతగ్గ ఫలం దక్కడం లేదు. సభాపతి ద్వారా సంగతి విన్న జ్ఞానగుప్తుడనే ప్రముఖ వ్యాపారి, స్వయంగా విశ్వనాధుడి దగ్గిరకు వచ్చి, ''విశ్వనాథా, కొంత కాలంగా నిన్ను గమనిస్తున్నాను. నీ నిజాయితీ నాకు నచ్చింది. నిన్ను అల్లుణ్ణి చేసుకుందామనుకుంటున్నాను. నీకు అభ్యంతరం లేకపోతే, నా కుమార్తెను వివాహం ఆడు. కట్నంగా, నా వ్యాపారాల్లో ఒకటైన కిరాణాకొట్టు అప్పగిస్తాను,'' అన్నాడు.

విశ్వనాధుడు అందుకు అంగీకరించాడు. ఈ సంగతి తెలిసి కళింగుడు, చక్రధరుడు, సభాపతి ఎంతగానో ఆశ్చర్యపోయారు. జ్ఞానగుప్తుడి వంటి ప్రముఖ వ్యాపారి, తన కుమార్తెను విశ్వనాధుడి కివ్వడమా!

వాళ్ళు జ్ఞానగుప్తుణ్ణి కలుసుకుని, తాము విన్నది చెప్పి, "ఈ మాట నిజమేనా? విశ్వనాధుడిలో వ్యాపార దక్షత లేదు. మీరప్పగించనున్న వ్యాపారంలో నష్టాలు తప్ప, లాభాలు గడించలేడు. అతడు నిజాయితీపరుడే గాని, పట్టి అమాయకుడు!" అన్నారు.

దానికి జ్ఞానగుప్తుడు, "విశ్వనాధుడు నిజాయితీపరుడన్నది నిజం. అతడు అమాయకుడు మాత్రం కాదు. మీరే చూస్తారు!" అని జవాబిచ్చాడు.

ఆ తర్వాత, జ్ఞానగుప్తుడి కుమార్తెతో, విశ్వనాధుడి వివాహం జరిగిపోయింది. అతడు కిరాణాకొట్టు వ్యాపార బాధ్యత తీసుకున్నాడు. అతడి నిజాయితీ ఎరిగిన ఊరిజనం, తమ కవసరం అయిన వస్తువులు, అతడి దుకాణంలోనే కొనసాగారు.

క్రమంగా విశ్వనాధుడికి వ్యాపారంలో నష్టం రాసాగింది. అతడి కొక కొడుకు పుట్టాడు. వ్యాపారంలో అల్లుడు నష్టపోతున్నాడని తెలిసీ, జ్ఞానగుప్తుడు, అతడికెలాంటి ధనసహాయం చెయ్యలేదు.

విశ్వనాధుడి భార్య అతడికి వ్యాపారంలో పెట్టుబడికిగాను, తన ఒంటి మీది



నగలు తీసియిస్తూ, ''మా నాన్న నుంచి, మీకెలాంటి ధన సహాయం రాదు. లోగడ మీరు ఒంటరివాళ్ళు. ఇప్పుడు బాబుతో కలిసి మనం ముగ్గురం. నిజాయితీపరుడు వ్యాపారంలో లాభాలు గడించలేడనుకోవడం తప్పు. పరులమేలు తప్ప, తన మేలు సంగతి తెలియనివాడు మాత్రం తప్పక నష్టపోతాడు,'' అని చెప్పింది.

భార్య మాటలు విని విశ్వనాధుడు ఆశ్చర్యపోతూ, ''అంటే, నన్ను పరుల మేలు మాటమరిచి, స్వార్థచింతనతో వ్యాపారం చేయమంటావా? అప్పుడు, నాలో నిజాయితీకి స్థానం ఎక్కడుంటుంది?'' అని అడిగాడు.

ఆ సమయంలో ఇంట్లోకి వస్తూ, ఆ భార్యాభర్తల సంభాషణం విన్న జ్ఞానగుప్తుడు, విశ్వనాధుడితో, ''విశ్వనాధా! అమ్మాయి చెప్పేది, నిన్ను నిజాయితీ విడిచి పుచ్చి స్వార్థపరుడివి కమ్మని కాదు. వ్యాపారంలో లాభాలు సంపాయించాలంటే కక్తీలూ, తప్పుడు తూకాలే శరణ్యంకాదు. అట్లని, ఇప్పుడు నువ్వు చేస్తున్న తీరులో, అసలు లాభం మాటే మరిచిపోవడం కూడా కాదు. కొన్న వస్తువు మీద, అమ్మేటప్పుడు న్యాయమైన కొద్ది లాభం వేసుకు చూడు, అప్పుడు నీ వ్యాపారం ఎలా నడుస్తుందో తెలుస్తుంది,'' అన్నాడు.

విశ్వనాధుడు అందుకు అంగీకారంగా తలాడించాడు. జ్ఞానగుప్తుడు అతడికి అప్పటికప్పుడే పెట్టుబడికిగాను కొంత ధనం ఇచ్చాడు.

ఇది జరిగాక విశ్వనాధుడు తతిమ్మా వర్తకులలాగా దురాశకుపోక, కొద్ది లాభంతో వస్తువులు అమ్మడం మొదలు పెట్టాడు.

ఇతర వర్తకుల దుకాణాలతో పోల్చితే, విశ్వనాధుడి దుకాణంలోని వస్తువుల ధరలు కొంత తక్కువ కావడంతో, అతడి అమ్మకాలు ముమ్మరంగా సాగి, కొద్ది కాలం తర్వాత, ఆ ప్రాంతానగల ప్రముఖ వర్తకుల్లో ఒకడయ్యాడు.






ఆదిత్యసేనుడు అనే రాజు ఆస్థానంలో చాలామంది ఉద్యోగులుండేవారు. వాళ్ళు ఏమాత్రం అవకాశం దొరికినా, ఆయనను అంతవాడివి, ఇంతవాడివి అంటూ, ముఖస్తుతితో, పొగడ్తలతో విసిగిస్తూ వుండే వాళ్ళు. రాజుకు వాళ్ళ పొగడ్తలు నిజాయితీతో అనేవి కాదని తెలుసు.

ఒకనాటి రాత్రి, భరించలేనంత చలి వేస్తున్నా, ఆదిత్యసేనుడు రాజప్రాసాదం వదిలి బయలుదేరాడు. ఎక్కడైనా ముఖస్తుతి పరాయణుడుకాని నిజాయితీ పరుడు కనిపిస్తాడేమో చూడాలనిపించిందాయనకు.

రాజు నిండుగా ఒక శాలువా కప్పుకుని, వీధి వెంట నడవసాగాడు. కొంత దూరం వెళ్ళాక, ఆయనకు ఒక ఇంటి అరుగు మీద ముడుచుకు పడుకున్న మనిషి ఒకడు కనిపించాడు.

ఆదిత్యసేనుడు అతణ్ణి సమీపించి, "నీకు చలిపుట్టడం లేదా ?'' అని అడిగాడు.

అందుకు వాడు, ''నేను కప్పుకున్నది చిరుగులపాత. అందువల్ల, చలిగాలి ఒక వైపు చిరిగిన కంతల్లో ప్రవేశించి, మరొక వైపు కంతల్లో నుంచి బయటికి పోతుంది. కాని, చలిగాలి మీరు కప్పుకున్న శాలువాలో ప్రవేశించిందో—ఇక దానికి బయటికి పోయే అవకాశం వుండదు. ఆ కారణంగా, మీరు చలిని తట్టుకోలేక పోతున్నారు; నేను తట్టుకోగలుగుతున్నాను!'' అన్నాడు.

రాజుకు, వాడి హాస్యధోరణి నవ్వు తెప్పించింది. ఆయన, వాణ్ణి, ''నా దగ్గిర నూరు బంగారుకాసులున్నవి. వాటిల్లో ఇరవై నీకిస్తాను. నన్ను రాజంతటివాడివని పొగడగలవా ?'' అని అడిగాడు.

''ఇరవైకాసులేనా ? అయ్యా, అంత చిన్న మొత్తానికి, మిమ్మల్ని అంత గొప్పగా

డి. రవిచంద్రరాజు

పొగడడం కుదరదు.'' అన్నాడు వాడు చిన్నగా నవ్వుతూ.

''ఒకవేళ, నా దగ్గిర వున్నదాంట్లో సగం ఇచ్చాననుకో. అప్పుడు?'' అని ప్రశ్నించాడు రాజు.

''అప్పుడు మనం ఇద్దరం సమానులమైపోతాం. మిమ్మల్ని పొగడవలసిన అవసరం ఏమీ వుండదు.'' అన్నాడా పేదవాడు.

ఆదిత్యసేనుడికి వాడి జవాబు చాలా ఆనందం కలిగించింది. తను అక్కడి నుంచి కొంత దూరం వెళితే, ధనాశకొద్దీ వాడు తనను పిలుస్తాడేమో చూడాలనుకుని, ఆయన ముందుకు నడిచాడు. అయినా, పేదవాడు ఆయన్ను పిలవలేదు. రాజు తిరిగి వాడి దగ్గిరకు వచ్చాడు.

''అయ్యా, తమరేదో నన్ను మళ్ళీ ఇంకేదో ప్రశ్నించేందుకు వచ్చినట్టుంది!'' అన్నాడు వాడు.

''ప్రశ్నించడానికి కాదు; నీ నుంచి పొగడ్తలు కోరివచ్చాను. నా దగ్గిర నూరు బంగారు కాసులున్నవని ముందే చెప్పావు గదా!'' అన్నాడు రాజు.

''అవును,'' అన్నాడు పేదవాడు.

''సరే. ఆ నూరు బంగారు కాసులూ ఇస్తాను. అప్పుడు నన్ను రాజంతవాడివని పొగడగలవు గదా?'' అన్నాడు రాజు.

ఆ మాటలకు పేదవాడు, ''అయ్యా, ఆ బంగారు కాసులన్నీ, నావి అయినప్పుడు, ఇక మిమ్మల్ని పొగడవలసిన అవసరం ఏమున్నది? బహుశా, మీరే అవసరం కొద్దీ నన్ను పొగడవచ్చు!'' అన్నాడు పెద్దగా నవ్వుతూ.

ఆదిత్యసేనుడు కూడా వాడితోపాటు నవ్వాడు.

తర్వాత ఆయన వాడికి నూరు బంగారు కాసులూ ఇవ్వడమే కాక, తానెవరైనదీ చెప్పి, వాణ్ణి తన ఆంతరంగిక సలహాదారుగా నియమించుకున్నాడు.

ఈ జరిగినది విన్న రాజోద్యోగులు, ఆనాటి నుంచీ రాజును, అయినదానికీ, కానిదానికీ పొగడడం మానుకున్నారు.



# దొంగ

అవంతీరాజు విపరీతమైన రాజ్యకాంక్ష కలవాడు. రాజ్యాన్ని విస్తరింపజేయడానికి, అతను ఇరుగు, పొరుగు రాజులతో ఎన్నో యుద్ధాలు చేశాడు. యుద్ధాల కారణంగా, వ్యాపారస్థుల్లో అతిసీతి బాగా పెరిగి పోయింది. ప్రకృతి కారణంగా కాటకాలేమీ లేకుండానే, దేశంలో క్షామం వచ్చింది.

ఆహారధాన్యాలు కొరత ఏర్పడి, దేశంలో దొంగతనాలు పెరిగాయి. చివరికి, రాజుగారి ధనాగారానికే కన్నం వేయబోయిన, దొంగ ఒకడు దొరికాడు.

"వాణ్ణి విడిచిపెట్టండి!" అన్నాడు మంత్రి.

దొంగ వెళ్ళిపోయాక రాజు, మంత్రిని, "దొంగను వదిలారేమిటి?" అని అడిగాడు. అందుకు మంత్రి, "క్షమించండి మహారాజా! దొంగతనం చేసింది వాడే అయినా, ఆ పరిస్థితిని కల్పించింది, మనం!" అన్నాడు.

దానితో రాజుకు కనువిప్పు కలిగి, యుద్ధాలు మాని, దేశంలో శాంతి భద్రతల్ని నెలకొల్పాడు.

—డా॥ తాటిచెర్ల గురురామప్రసాద్





# భట్రాజుయుక్తి

ఒక గ్రామంలో వెంకన్నభట్టు అనే భట్రాజుండేవాడు. అతను చాలా చాకచక్యం గలవాడు. గ్రామంలో ఎక్కడ ఏ శుభకార్యం జరిగినా వెళ్ళి, అక్కడి వారిని పొగడుతూ పద్యాలు చెప్పి, వారిచ్చిన బహుమానాలు పుచ్చుకుని జీవనం గడుపుతూ ఉండేవాడు.

ఊళ్ళో అందరూ అతనికి అంతో ఇంతో ముట్టజెప్పేవారేగాని, ఆ వూరి జమీందారు మాత్రం ఏనాడూ వెంకన్నభట్టు చేతిలో ఎర్రని ఏగానీ పెట్టిన పాపాన పోలేదు. జమీందారు గారింట శుభకార్యం జరిగినప్పుడల్లా వెంకన్నభట్టు వెళ్ళి, పద్యాలు చదువుతూనే ఉండేవాడు. కాని, పిసినిగొట్టు జమీందారు ప్రతిసారీ, ''ఆహా, ఎంత చక్కని పద్యాలు చెప్పావు! ఇందుకుగాను నీకు మంచి ఈనాం ఇవ్వాలి. వచ్చే శుభకార్యానికి కనపడు,'' అనేవాడు.

ఇలా ఎన్నో శుభకార్యాలు జరిగాయి కాని, వెంకన్నభట్టుకు మాత్రం చిన్న కానుక కూడా ముట్టలేదు.

ఇంతలో జమీందారుగారి కూతురి వివాహం వచ్చింది. ఈసారి అయినా జమీందారు వద్ద నుంచి మంచి బహుమానం పొందితీరాలని వెంకన్నభట్టు నిశ్చయించుకున్నాడు. అతనికి పాడి లేకపోవటం పెద్ద కొరతగా ఉంటూ వచ్చింది. ఈ పెళ్ళి సందర్భంలో ఎలాగయినా జమీందారు నుంచి ఒక మంచి పాడిఆవును బహుమానంగా పుచ్చుకోవాలని వెంకన్నభట్టు ఆలోచించాడు.

అతను పెళ్ళి ఇంటికి, జమీందారుగారు బంధుమిత్రులతో ఉండగా వెళ్ళి, జమీందారును పొగడుతూ, వధూవరులను దీవిస్తూ పద్యాలు చదివి, ''ధర్మదాతలు! ఈసారి తప్పక మంచి ఈనాం ఇప్పిస్తా

మన్నారు. అది దయచేయింపించండి!'' అన్నాడు.

బంధుమిత్రుల మధ్య ఈనాం ఇవ్వకుండా తప్పించుకోవటానికి వీల్లేని పరిస్థితి ఏర్పడటం చేత జమీందారు, ''ఏ మివ్వమన్నావు?'' అన్నాడు.

''పిల్లలు గలవాణ్ణి. ఒక్క పాడి ఆవును దయచేయించండి,'' అన్నాడు వెంకన్నభట్టు.

జమీందారు ఒక నౌకరును పిలిచి, వాడితో రహస్యంగా, ''ఒక ముసలి ఆవును వెతికి పట్టుకొచ్చి వాడి కిచ్చెయ్యి,'' అని చెప్పాడు.

నౌకరు వెళ్ళి త్వరలోనే ఒక ముసలి ఆవును తెచ్చి, జమీందారుగారి ఎదట పెట్టాడు. దాన్ని చూసి అతిథులందరూ ఆశ్చర్యపోయి, భట్రాజు ఏమంటాడోనని ఆత్రంగా ఎదురు చూడసాగారు.

వెంకన్నభట్టు ఇరకాటంలో పడ్డాడు. ఆవును తీసుకోవటం బొత్తిగా నిష్ప్రయోజనం. తీసుకోనంటే జమీందారుగారిని అవమానపరిచినట్టవుతుంది. అది ఆయనకు ఆగ్రహం కలిగించవచ్చు అందుచేత ఆ ముసలి ఆవును తీసుకోకుండా ఉండటానికి అత నొక యుక్తి పన్నాడు.

అతను ఆవు వద్దకు వెళ్ళి, దాని చెవిలో ఏదో చెప్పినట్టు చెప్పి, దాని మూతి దగ్గిర చెవిపెట్టి ఆలకిస్తున్నట్టు అభినయించసాగాడు. అది చూసి అందరికీ అమిత ఆశ్చర్యం వేసింది.



జమీందారు వెటకారంగా "అవుతో ఏదో గుసగుసలాడుతున్నావేమిటి, వెంకన్నా ?" అని అడిగాడు.

"ఏం లేదు, మహాప్రభో ! నేనీ అవును, 'ఈన మోస్తావా ?' అని అడిగాను." అన్నాడు వెంకన్నభట్టు.

"ఆహాఁ అలాగా, మరి అదేమంటుంది?" అన్నాడు జమీందారు మరింత వేళాకోళంగా.

"అది ఏమంటుందంటే : 'నేను కృత యుగంలో మహిషాసురుడి వద్ద ఉండే దాన్ని. మహిషాసురుడు కాస్తా ఆదిశక్తి చేతిలో అంతమయాడు. కృతయుగం అంతమయినా కూడా నేను చావలేదు. త్రేతాయుగం వచ్చింది. రావణుడు పుట్టటమూ, రాముడి చేతిలో చావటమూ కూడా కళ్ళారా చూశాను. ఆ తరవాత ద్వాపరయుగంలో కంసుడు పుట్టాడు. కృష్ణుడు వచ్చి కంసుణ్ణి చంపటం కూడా కళ్ళారా చూశాను అప్పటికీ నాకు చావు రాలేదు. అయితే నాకు దేనిమీదా ఈనాడు భ్రాంతి లేదు. వైరాగ్యం కూడా ఏర్పడింది. కలియుగం వచ్చేసింది. ఇన్ని యుగాలు చూసిన దాన్ని పట్టుకుని ఈన మోస్తావా అని అడగటానికి నీకు సిగ్గు లేదా ? నలుగురూ నన్ను చూసి నవ్వరా ?' అంటున్నది, మహాప్రభో,!" అన్నాడు వెంకన్నభట్టు.

అతడి మాటలకు అక్కడ ఉన్న వారంతా గొల్లున నవ్వారు. పదిమంది లోనూ జమీందారుకు బాగా తలవంపు లయింది.

"చచ్చు వెధవా ! మంచి పాడి అవును పట్టుకు రారా అంటే ముసలి అవును తెచ్చావా ? వెళ్ళి, వెంటనే మంచి పాడి అవును పట్టుకు రా !" అని జమీందారు నౌకరు పైన నిప్పులు కక్కాడు.

నౌకరు ముసలి అవును తీసుకుపోయి, మంచి పాడి అవును తీసుకు వచ్చాడు. వెంకన్నభట్టు జమీందారుగారి దానశీలత పైన మరికొన్ని పద్యాలు చదివి, ఆ అవును ఇంటికి తోలుకుపోయాడు.





## బద్ధకం!

అమెరికాలోని ఉష్ణప్రదేశాలలో నివసించే స్లాత్ అనే మూడువేళ్ళ దేవాంగి పిల్లి, అతి నిదానంగా నడిచే సస్తన జంతువుగా పరిగణించబడుతున్నది. ఇది నేల మీద నిమిషానికి 6.8 అడుగుల వేగంతోనూ, చెట్ల మీద నిమిషానికి 2 అడుగుల వేగంతోనూ నడుస్తుంది!



## ప్రాచీనమైన పూచే మొక్క!

గింక్‌గో అనే పూలమొక్క, పూచే మొక్కలలో అతి ప్రాచీనమైనదిగా భావించబడుతున్నది. ఈ మొక్క 180,000,000 సంవత్సరాలక్రితం చైనాలో ఉండేది!

## వింతివించిన పొగమంచు

కెనడాలోని న్యూఫౌండ్‌లాండ్, గ్రాండ్‌బాంక్స్ ప్రాంతంలో ప్రపంచంలో కెల్లా ఎక్కువ పొగమంచు కురుస్తున్నది. ఇక్కడ సంవత్సరంలో సగటున 120 రోజులు పొగమంచు కురుస్తుంది!



## పాల బిస్కట్లు—
## నవ్వుతూ, తుళ్లుతూ పెరిగే పాపాయిలకు నేస్తం!




రుచికరమైన, పుష్టికరమైన బిస్కట్లు

బ్రిటానియా

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1987 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



P. Balasubramanian

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ నవంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలను కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: దీపావళి ఆనందం! రెండవ ఫోటో: ఆత్మీయతానుబంధం!

పంపినవారు: యం. శ్రీకుమార్, పాటిగడ్డ కాలనీ, సికిందరాబాద్ (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# విజయచిత్ర

## వింశతి వత్సర విశేష సంచిక

మీ అభిమాన తారల
స్వర్ణమయ వర్ణచిత్రాలు, ఉపయుక్తమైన
ప్రత్యేక వ్యాసాలు, ప్రముఖుల రచనలు,
పెద్ద గోష్ఠులు, చిత్ర విచిత్ర విశేషాలు,
రెండు విస్తృత వర్ణచిత్రాలతో

కలకాలం దాచుకోదగ్గ రీతిలో
సకళ కళా భరితంగా అత్యంత ఆకర్షణీయంగా
వెలువడింది



వెల: పన్నెండు రూపాయలు మాత్రమే

ప్రతులకు: డాల్టన్ ఏజెన్సీస్, చందమామ బిల్డింగ్స్,
వడపళని, మద్రాసు-600 026.

# మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తారు జనం సూపర్ రిన్‌తో తళతళలాడే ఆ తెల్లదనం




**సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు**
మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు.

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి